# ఆంధ్ర ప్రదేశ్



సమాచార, పౌరసంబంధములశాఖ ; ఆంధ్ర ప్రదేశ్


Registered No. H-373.

సంపుటి 2 | జూలై, 1958—ఆషాఢము, శాలివాహనశకము - 1880 | సంచిక 9

ఆంధ్రప్రదేశ్ సమాచార, పౌరసంబంధములశాఖవారిచే ప్రచురింపబడినది.

# దేశంతో పాటు మీరు కూడా
# అభ్యుదయం పొందండి!

## మీరు మిగుల్చుకున్న డబ్బును
## భారత ప్రభుత్వ చిన్న మొత్తముల పొదుపు పథకమునకు
## పెట్టుబడి పెట్టండి!

*భారత దేశం యొక్క*

సమాజాభివృద్ధి కార్యక్రమమునకు, గొప్పనదీలోయ ప్రాజెక్టులకు,
రైలుమార్గములు, రోడ్ల అభివృద్ధికి తోడ్పడండి!

*మీ డబ్బును యీ క్రింది గ్యారంటీడ్ సెక్యూరిటీలలో దేనిలోనైనా పెట్టుబడి పెట్టండి!*

| | |
|---|---|
| *12 సంవత్సరముల నేషనల్ ప్లాన్ సేవింగ్సు సర్టిఫికెట్లు* | పరిణతి పొందిన పిమ్మట నూటికి సంవత్సరానికి 5.41 వంతుల చొప్పున వడ్డీ ఇవ్వబడుతుంది. ఇవి రూ. 5 లవి మొదలు రూ. 5,000 లవి వరకూ లభిస్తాయి. వ్యక్తిగతంగా ఒక్కొక్కరు రూ. 25,000 ల వరకూ కొనవచ్చు. |
| *10 సంవత్సరముల ట్రెజరీ సేవింగ్సు డిపాజిట్ సర్టిఫికెట్లు* | ఏటా నూటికి 4 వంతులు వడ్డీ చెల్లించబడుతుంది. ఒక్కొక్కరు రూ. 50 లవి మొదలు రూ. 25,000 లవి వరకూ కొనవచ్చు. |
| *పోస్టాఫీసు సేవింగ్సు బ్యాంకుఅక్కౌంట్లు* | రూ. 25 ల నుంచి రూ. 10,000 ల వరకూ గల నిల్వలపై నూటికి 2½ వంతులచొప్పునా, రూ. 10,000 లను మించిన నిల్వలపై నూటికి 2 వంతుల చొప్పునా వడ్డీ ఇవ్వబడుతుంది. |

15 సంవత్సరముల ఆన్యూయిటీ సర్టిఫికెట్లు (రెండవ సీరీస్)

| | |
|---|---|
| జారీచేయబడు ధరలు: రూ. 3,325, రూ. 6,650, రూ. 13,300 రూ. 26,600. | ఈ సొమ్ము, నూటికి సంవత్సరానికి కొంచెమెక్కువగా 4 వంతుల చొప్పున యిచ్చే చక్రవడ్డీతో సహా నెలసరి వాయిదాలలో 15 సంవత్సరాలలో తిరిగి చెల్లించబడుతుంది.<br>వ్యక్తిగతంగా ఒక్కొక్కరు రూ. 26,600 ల వరకు కొనవచ్చు. |

## ఆదాయపు పన్ను లేకుండా మీకు మంచి ఆదాయం లభిస్తుంది!
## భావి భారత సౌభాగ్యానికై పెట్టుబడి పెట్టండి!

ఇతర వివరములకు, యీ పెట్టుబళ్ళకి సంబంధించిన నిబంధనావళికొరకు:

**నేషనల్ సేవింగ్సు కమిషనర్, నాగపూర్ చిరునామాకికాని లేక**
**రీజియనల్ నేషనల్ సేవింగ్సు ఆఫీసర్, ఆంధ్రప్రదేశ్, హైదరాబాదు (దక్కన్)**

చిరునామాకి కాని వ్రాయాలి.



# ఆంధ్రప్రదేశ్

జూలై, 1958.

సంపుటి 2 సంచిక 9

ఆషాఢము, శాలివాహనశకము - 1880

## విషయసూచిక

| | | |
|---|---|---|
| ఆంధ్రప్రదేశ్ దిగువసభ అవతరణ | ... | 1 |
| ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం ముందంజ | ... | 5 |
| యుగధర్మం | ... | 21 |
| కడం ప్రాజెక్టు | ... | 23 |
| ఆంధ్రప్రదేశ్ జిల్లాలు : గుంటూరు | ... | 30 |
| ప్రశ్నోత్తరావళి | ... | 36 |
| ద్వితీయ ప్రణాళిక లక్ష్యాలు | ... | 38 |
| అభివృద్ధి కార్యక్రమ కేంద్రాల విశేషాలు | ... | 40 |
| రాష్ట్రంలో వైద్యసౌకర్యాల విస్తరణ | ... | 43 |
| భారత్ సేవక్ సమాజ్ పాత్ర | ... | 50 |
| ఖాదీ గ్రామోద్యోగ మహా విద్యాలయంలో | ... | 53 |
| విస్కౌంటు విమాన సర్వీసు | ... | 54 |
| సుఖీభవ | ... | 55 |
| భారతమాత | ... | 57 |

— చందా వివరాలు —

సంవత్సరానికి 2 రూపాయల 16 నయాపైసలు

విడిప్రతి వెల 18 నయాపైసలు

ఆంధ్రప్రదేశ్ సమాచార, పౌరసంబంధములశాఖచే ప్రచురింపబడి

సిటిజన్ ప్రెస్‌లో ముద్రింపబడినది.

## ముఖచిత్రం



ఆంధ్రప్రదేశ్ తొలి లెజిస్లేటివ్ కౌన్సిలు (7-7-58 న రాష్ట్రపతి డా. రాజేంద్రప్రసాద్ చే ప్రారంభించ బడింది).

## నాల్గవ అట్ట



రాష్ట్ర లెజిస్లేటివ్ కౌన్సిలు అధ్యక్షుడు శ్రీ ఎమ్. హనుమంతరావు: తమను ప్రశంసిస్తూ చేసిన ప్రసంగాలకి జవాబుగా ప్రసంగిస్తున్న దృశ్యం.

రాష్ట్రపతి చేతిమీదుగా

# ఆంధ్రప్రదేశ్ యెగువసభ అవతరణ

ఆంధ్రప్రదేశ్ తొలి లెజిస్లేటివ్ కౌన్సిలుకి హైదరాబాదు పౌరోద్యానాలలోని జూబ్లీహాలులో రాష్ట్రపతి డా. రాజేంద్రప్రసాద్ 7-7-58 న ప్రారంభోత్సవం చేశారు. ఆ సందర్భంలో ఆయన యిలా అన్నారు :

"ఆంధ్రప్రదేశ్ లెజిస్లేటివ్ కౌన్సిల్‌కు ప్రారంభోత్సవం చేయడానికై ఇక్కడికి రావడం నాకెంతో సంతోషాన్ని కలిగిస్తున్నది. అత్యంత శుభప్రదమైన యీ సంతోష సమయంలో, ఆంధ్రప్రదేశ్ శాసన కర్తలైన మీకు, మీద్వారా ఆంధ్రప్రదేశ్ ప్రజానీకానికి నా శుభాకాంక్షల్ని అందజేస్తున్నాను. ఈ సభకికొత్తగా ఎన్నికైన సభ్యులకు నాఅభినందనలు. ఈ రాష్ట్రంలో శాసన నిర్మాణానికి మీరు కూడా తోడ్పడవలసి వచ్చింది, మీకు ఇప్పుడు కలిగిన మహావకాశంగా వుంది. ఆ బాధ్యతా నిర్వహణలో మీరు మీకుగల విజ్ఞతను, ప్రజలలో వున్న ఉత్సాహాన్ని, వారి అండదండలను పూర్తిగ వినియోగించుకోవాలి.

"ఆధునిక ప్రపంచంలో శాసన నిర్మాణం నానాటికి క్లిష్టతర మౌతున్నది. దాని సమస్యల వత్తిడి పెరిగి పోతున్నది. ఎగువ సభలు, శాసనాల పునః పరిశీలనకు అత్యవసరమనే పాత భావం యీనాడు అంత ప్రధానం కానప్పటికి, ప్రపంచంలోని ప్రస్తుత అవసరాలను బట్టి యింకా ఎగువ సభలు విలువైన ప్రయోజనాలకి వుపయోగ పడతాయి. అల్ప సంఖ్యాక వర్గాలకి, జాతీయ జీవితంలో విభిన్న రంగాలలో అనుభవం, ప్రత్యేకమైన విజ్ఞానం కల వారికి ప్రాతినిధ్య మివ్వడానికేమి, శాసన నిర్మాణ విషయంలో జరిగే చర్చలకి తోడ్పడడానికేమి, అందుకు సంబంధించిన వివిధాంశాల్ని పరిణతి పొందిన అనుభవంతో పరిశీలించి ఆలోచన చెప్పడానికేమి యివి అవకాశం కల్పిస్తాయి.

"శాసన సభల ప్రధాన కర్తవ్యం, ప్రజలు తమ భవితవ్యాన్ని తీర్చి దిద్దుకొనుట కవకాశ మిచ్చే సౌష్ఠవమైన శాసనాల్ని చేయడం. ఆ బాధ్యతా నిర్వహణలో, అనుభవం, విజ్ఞానం కలవారి సేవను జాతి విస్మరించలేదు. విస్మరిస్తే ఆ అనుభవం, విజ్ఞానం వృథా పోగలవు. ఆంధ్రప్రదేశ్ యెగువ సభకు నేడు ప్రారంభోత్సవం జరగడంతో, యిప్పుడిక రాష్ట్రంలో శాసన నిర్మాణ వ్యవస్థ పూర్తిగా ఏర్పడిందని చెప్పవచ్చు.

"1953లో ఆంధ్రరాష్ట్రం ప్రత్యేక రాష్ట్రంగా యేర్పడినప్పుడు చెప్పిన విషయాలనే నేను మళ్లీ చెప్పదలుస్తున్నాను. ఆ సమయంలో మీ ఆనందోత్సాహాలలో నేను కూడా పాలు పంచుకుంటూనే, ప్రత్యేక రాష్ట్ర నిర్మాణంతో, ఆ రాష్ట్ర వాంఛను వ్యక్తం చేసిన వారిపై ప్రత్యేక బాధ్యత పడిందని చెప్పాను. ఎంచేతంటే చట్టబద్ధమైన యీ ఏర్పాట్లన్నీ, ప్రజాసేవ చేయుటకేమి, వారి సంక్షేమ సాధనకి కృషి చేయుటకేమి సాధనాలు మాత్రమే. అయిదు సంవత్సరాల క్రితం చెప్పిన యీ మాటల్ని నేటి పరిస్థితులకు అన్వయించుకుంటే వాటికి మరింత విలువ వస్తుంది.

"ఆంధ్రప్రదేశ్, యిప్పుడు భారతదేశ రాష్ట్రాలలో ప్రధానమైనదిగా, అభ్యుదయ పథంలో పయనించ డానికి సిద్ధంగా వున్నది. ఈ రాష్ట్రంలో మీకు ప్రకృతి సంపద పుష్కలంగా వుంది. తగినంతగా జనబలం వుంది. సుదీర్ఘమైన కోస్తా వుంది. సహజమైన చక్కని నౌకాశ్రయం వుంది. దేశానికి గల



ఉపాధ్యక్షుడు శ్రీ బి. సుబ్బరాజు

ఒకే ఒక నౌకా నిర్మాణ కేంద్రం ఇక్కడ వుంది. దానికి తోడు అనేక రైలు—రోడ్డు రహదారులున్నాయి. మొత్తంమీద మీ రాష్ట్రంలో సారవంతమైనభూములున్నాయి. రెండు మహానదులు, వాటి ఉపనదులు, అనేకమైన కాల్వలు యీ భూములను సాగుచేస్తున్నవి. అద్యతన భావిలోనే మీ నదీజలాలు వృథా కాకుండా అరికట్టబడి, యెక్కువ సాగునీటి సౌకర్యాలు, విద్యుచ్ఛక్తి వసతులు మీకు సమకూరగలవు. గొప్ప పారిశ్రామిక సంపద మీ వినియోగం కోసం ఎదురు చూస్తున్నది.

"కష్టపడి పని చేసే మీ ప్రజలు, వారికి గల గర్వపడదగిన సంస్కృతి వగైరాలను గురించి నేను యెక్కువ చెప్పవలసిన అవసరం లేదు. ఆంధ్రుల చరిత్ర మహోత్తరమైనది. అది మీకు మాత్రమే కాక దేశం మొత్తానికే ఉత్తేజాన్ని కలిగిస్తుంది. భారతీయ సంస్కృతిని పెంపొందింప చేయడంలో నేమి, భద్రపరచడంలో నేమి దానిని నేల నాలుగు చెరగుల వ్యాపింప జేయడంలో నేమి యీ శకం తొలి శతాబ్దులలో మీరు గమనీయమైన కృషి చేశారు. మీ యీ పూర్వ చరిత్ర, వర్తమానంలో మీకు గల అపారమైన భౌతిక సంపదల దృష్ట్యాను, అందుబాటులో వున్న సరి కొత్త అవకాశాల దృష్ట్యాను యీ రాష్ట్ర ప్రజలు సుఖ సంపదలతో తులతూగే నవశకోదయాన్ని కోరవచ్చు. అలా కోరే హక్కు వారికి వుంది. ఆ శకంలో పేదరికం, అజ్ఞానం తొలగించబడి ప్రతి పౌరునికి కనీసపు జీవితావసరాలు సమకూరాలి. ఇందుకు సంబంధించిన పునర్నిర్మాణ కార్యక్రమంలో అగ్రగాములుగా పనిచేసే సదవకాశం ఆంధ్రప్రదేశ్ శాసన సభ్యులైన మీకు లభించింది. మీకు ఇప్పుడు లభించిన, ఇక ముందు లభించనున్న అవకాశాలు యీ రాష్ట్రం పొందగల అభివృద్ధిని బట్టి మాత్రమే సమర్థనీయమైనవని నిర్ణయం కాగలదు.

"అనేక శతాబ్దాలు నిద్రాణంగా వున్న మనం యీ మధ్యనే మేల్కొన్నాము. ప్రజల వోటు



ఎగువసభ తాత్కాలిక అధ్యక్షుడు శ్రీ జి. బ్రహ్మయ్య



ఎగువసభ అధ్యక్షుడుగా యెన్నికయిన శ్రీ మాడపాటి హనుమంతరావు

ద్వారా అధికారానికి వచ్చిన మనందరం, మనకు లభించిన అవకాశాలతో జాతీయాభ్యున్నతికి కృషి చేసి తద్వారా వర్తమాన పరిస్థితులే కాక భావితరాలపట్ల కూడా మన విధిని నిర్వర్తించాలి. నేటి పాలకులు కేవలం సంతృప్తికరంగా పరిపాలిస్తే చాలదు. వారు రాష్ట్రంలోని ప్రతివ్యక్తికి, ఆతని కులం, విశ్వాసం ఏదైనప్పటికీ, అతను ఏ ప్రాంతానికి చెందిన వాడైనప్పటికీ, తన శ్రేయస్సు, సంక్షేమం తమ చేతిలో భద్రంగా వున్నాయనే నమ్మకం కలిగించాలి. అంతేకాక కేవలం అధిక సంఖ్యాక వర్గానికే కాక అల్పసంఖ్యాక వర్గం అభిప్రాయానికి కూడా పూర్తి వ్యక్తీకరణ, మున్నగు హక్కు లుంటాయనే భావాన్ని కూడా వారు కలిగించాలి. ఆ అల్పసంఖ్యాక వర్గం యెంత చిన్నదైనా, దాని మత భాషా సంస్కృతులు, ప్రాంతం యేదైనా దానికి యీ భావం కలిగించాలి. ఆపైన నవభారత నిర్మాణానికి పునాదులు వేసే బాధ్యత కూడా వారి మీదనే వుంది. ప్రపంచంలో మిక్కిలి పెద్ద శ్రేయో

రాజ్యాలలో ఒక దాని నిర్మాణానికి తగిన పునాదిని వేసే మహత్తరమైన బాధ్యత వారికిఅప్పగించబడింది. ఈ కృషిలో ప్రతి పౌరుడు, యెంత తక్కువస్థాయిలో వున్న వాడయినా సరే భాగస్వామే. ఈ కృషిలో మనకు గల భాగాన్ని స్త్రీలు, పురుషులు అందరూ నిర్వహించాలి. మన మేర్పరుచుకున్న యీ లక్ష్యం సిద్ధించుటకై ప్రజలు కూడా కృషి చేయాలి. కాబట్టి యీ విషయంలో వారినివుత్సాహ పూరితుల్ని చేసి వారి జీవితాల్ని యిందుకు అంకితం చేసేలా వార్ని పడపమని ప్రజా ప్రతినిధులికి, ప్రజా నాయకులికి ప్రత్యేకం విజ్ఞప్తి చేస్తున్నాను.

"ఆంధ్రప్రదేశ్ యెగువ సభకి ఎన్నికైన సభ్యులను తిరిగి మరొక సారి అభినందిస్తూ, ఆంధ్రలో శాసన నిర్మాణానికి వారు తోడ్పడగలరని, వారి చర్చలు రాష్ట్ర పరి పాలనలో విలువైన భాగం కాగలవని ఆశిస్తున్నాను. మీ అందరూ అదృష్ట వంతులై జాతికి సేవచేయాలని కాంక్షిస్తున్నాను."



ప్రజాస్వామిక వికేంద్రీకరణలో

# ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం ముందంజ

## జిల్లాల్లో పంచాయతీ సమితుల స్థాపనద్వారా

### నవశకోదయానికి నాందీ ప్రస్తావన

1958 జూలై 1వ. తేదీన జిల్లా కొకటి చొప్పున 20 జిల్లాల్లోను కొత్త ప్రజాస్వామిక సంస్థలు అవతరించడంతో ఆంధ్రప్రదేశ్ ఒక ముఖ్య ఘట్టంలో ప్రవేశించింది.

ఈ సంస్థల అవతరణతో, గ్రామాలలోని ప్రజా ప్రతినిధులు యెక్కువ బాధ్యతని వహించాలి. ఇది ప్రజాస్వామిక వికేంద్రీకరణపై బల్వంతరాయ్ మెహతా కమిటీ సూచనల్ని అమలు జరుపుటకు ప్రభుత్వం చేసిన నిర్ణయం మొదటి ఫలితం. జిల్లా కొకటి చొప్పున 20 బ్లాకులలోను ప్రారంభమైన అడ్ హాక్ పంచాయతీ సమితులు బ్లాకు ప్లానింగు, అభివృద్ధి కమిటీల పనుల్ని వెంటనే తీసుకుంటాయి. అందుకి అభివృద్ధి కేంద్రాలకి సంబంధించి అభివృద్ధి శాఖలు జరిపే పనులన్నీ వాటికి బదిలీ చేయబడతాయి.

అన్ని జిల్లాల్లోను కూడా యీ సమితులకి విస్తృత కార్యక్రమంతో వుచిత రీతిని ప్రారంభోత్సవం జరిగింది. ప్రభాత భేరిలు, వూరేగింపులు, బహిరంగ సభలు జరుపబడ్డాయి. బహిరంగ సభలకి గ్రామనాయకులు అధ్యక్షత వహించారు. ఈ పథకం ముఖ్యాంశాల్ని ప్రజలకి వివరించి, వారి కొత్త బాధ్యతల్ని గురించి వారికి నొక్కి చెప్పడం జరిగింది. చాల ప్రదేశాలలో శ్రమదానం, సాంస్కృతిక ప్రదర్శనలు, ఆటలు యేర్పాటు చేయబడినవి.



రాష్ట్ర గవర్నరు

ఈ సమితుల ప్రారంభోత్సవం సందర్భంలో రాష్ట్ర గవర్నరు, రాష్ట్ర ముఖ్యమంత్రి ప్రభృతులు,



1-7-58 న రాష్ట్ర ముఖ్యమంత్రి శ్రీ ఎన్. సంజీవరెడ్డి మహబూబానా నామలో పంచాయతీ సమితి ప్రారంభోత్సవం చేశారు.

కేంద్ర సమాజాభివృద్ధి శాఖామంత్రి శ్రీ ఎస్. కె. డే సందేశాలు పంపారు. వాటి పాఠం వివరాలు యివి. —

## రాష్ట్ర గవర్నరు శ్రీ భీమసేన సచార్

1958 జూలై ఒకటవ తేదీ నుంచి రాష్ట్రప్రభుత్వం జిల్లా కొకటి చొప్పున పంచాయతీ సమితులను ఏర్పాటుచేయడానికి నిశ్చయించినందుకు నాకెంతో సంతోషంగా ఉన్నది. పరిపాలనా వికేంద్రీకరణ దృష్ట్యా ఇది చాలాగొప్ప విషయం. ఎందుకంటే యిందుమూలంగా మిక్కిలి కింది స్థాయిలో, ప్రజలకి పరిపాలనా వ్యవస్థతో సాధ్యమైనంతసన్నిహితత్వం ఏర్పడుతుంది. ఈ సమితులు ప్రాతినిధ్యం గల సంస్థలు. అంటే వాటిలో పంచాయతీల అధ్యక్షులు, పంచాయతీలు లేని గ్రామాల ప్రతినిధులు, యితర ప్రయోజనాలకి ప్రాతినిధ్యం వహిస్తూ కోఆప్ట్ చేసు కోబడినవారు సభ్యులుగా వుంటారు. ఒక స్త్రీకి కూడా సభ్యత్వమున్నది. కాబట్టి యివి ఆ ప్రాంతపు ప్రజల అవసరాలను, ఆశయాలను సరిగా ప్రతిబింబింపజేస్తాయి. ఈ విధంగా గ్రామీణ ప్రజలు స్థానిక వ్యవహారాల పట్ల తమ బాధ్యతను గుర్తించ గలుగుతారు. పరిపాలనా సమస్యలను పరిష్కరించటం మూలంగా పరిపాలనలోని ఇబ్బందుల్ని వారు తెలుసుకుంటారు. ఈ విధంగా వారు వాస్తవిక దృక్పథాన్ని పెంపొందించుకొని జాతి పటిష్ఠతకి తోడ్పడుతారు. ఎంచేతంటే పరిస్థితుల వాస్తవాన్ని ప్రజలు తెలుసుకొన్న కొద్దీ జాతి బలపడుతూ వుంటుంది. అప్పుడు స్వప్నసీమలలోను, వూహాలోకాల్లోను విహరించే జాతివుండదు. ఆత్మవిశ్వాసాన్ని, కార్య ప్రారంభాసక్తిని పెంపొందించుకొనటకు అవకాశాలు లేనందువల్ల, మన ప్రజలు యితరుల కంటె తాము తక్కువ వారమనే అభిప్రాయానికి లోనైనారు. సమితులు యీ అభిప్రాయాన్ని కూడా తొలగించ గలవని నమ్ముతున్నాను.

ప్రభుత్వ నిర్ణయం ప్రాముఖ్యాన్ని గుర్తించటం అవసరం. దాన్ని చులకనచేయ గూడదు. ఎంచేతంటే యీ విధానాన్ని ఇతర ప్రాంతాలకు సత్వరంగా వర్తింపచేయటం దానిఫలితాలపై ఆధారపడివుంది. సామాన్య ప్రజానీకానికి అధికారాల్ని విస్తరింపచేసే ప్రతిపాదనలవల్ల కలిగే సందేహాల సంగతి

వాకు తెలియనిది కాదు. మన వ్యవహార నిర్వహణకి మనం తగమేమోనన్న అభిప్రాయమే చాలవరకూ యీ సంశయానికి కారణం. గ్రామీణులు నిష్పాక్షికమైన నిర్ణయాలు చేయడం కేవలం అసంభవమని చెబుతూ, దాని కుదాహరణగా వారిలో తరచు కలిగే విభేదాల్ని వేలెట్టి చూపిస్తారు. ఈ వాదనకి బలం లేదనను. న్యాయం సరిగా జరగదేమోనన్న భయంతో మనం మన ప్రజలకు బాధ్యతనప్పగించక పోతే, మనమనుకున్నట్టుగా స్వరాజ్యాన్ని గ్రామాల్లో ప్రతిష్ఠింపజేసే శుభముహూర్తం రానే



చిత్తూరు జిల్లా కలికిరి పంచాయతీ సమితి సభ్యులు: వీరు తమ తొలి సమావేశాన్ని 1-7-59న జరిపారు



విశాఖపట్నం జిల్లా కోటవురట్ల పంచాయతీ సమితి అధ్యక్షుడు శ్రీ సాగి సీతారామరాజు జూలై 1వ. తేదీన సభలో ప్రసంగిస్తున్న దృశ్యం

రాదు. కాబట్టి ప్రయోగాత్మకమైన యీ చర్యతో ప్రమేయం ఉన్నవారందరూ స్థిరసంకల్పంతో ధైర్యంతో పురోగమించి, ఆదర్శం ద్వారానేమి ఆచరణద్వారానేమి పరిపాలనా వికేంద్రీకరణలో ముఖ్యపాత్ర వహించే యీ ప్రయోగం సఫలం కావడానికి తగిన వాతావరణాన్ని సృష్టించాలి. ఈ రంగంలో మార్గదర్శకత్వం వహించే మహదవకాశం కలవారు యీ ఉత్తమ కార్యం జయప్రదం కావడానికి తమ శక్తి కొలదీ పనిచేస్తారనే నానమ్మకం. వారికి అభినందనలేమి వారి కృషి జయప్రదం కావాలనే శుభాకాంక్షలేమి పంపడానికినాకు ఆనందంగా వుంది.

### రాష్ట్ర ముఖ్యమంత్రి శ్రీ నీలం సంజీవరెడ్డి :

గ్రామీణుల జీవితం సర్వతోముఖంగా అభివృద్ధిచెంది వికసించుటకు తోడ్పడటం, ప్రతి వ్యక్తిలో ఆత్మవిశ్వాసాన్ని, సమాజంలో సంఘీభావాన్ని సుస్థిరం చేయటం మూలంగా గ్రామీణులు తమ

వ్యవహారాల్ని స్వయంగా నిర్వహించుకుని పంచాయతీలు, సహకార వ్యవస్థల్ని సంతృప్తి కరంగా నడిపి తద్వారా తమ గ్రామాల్ని భారతదేశ ప్రజాస్వామ్యంలో స్వయం పరిపాలన కేంద్రాలుగా అభివృద్ధి చేసుకొనుటకు దోహదం చేయడం సమాజాభివృద్ధి కార్యక్రమం లక్ష్యం. గ్రామీణ, బ్లాకు, జిల్లా స్థాయిల్లో ప్రాతినిధ్యం గల స్థానిక ప్రజాస్వామిక సంస్థలను నెలకొల్పనిదే ఇదిసాధ్యం కాదని జాతీయ అభివృద్ధి సమితి, ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వమూ గుర్తించాయి. ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం దిగువ విధంగా నిర్ణయించింది.

1. గ్రామ స్థాయిలో పంచాయతీలను పునరుజ్జీవింప జేయాలి.

2. బ్లాకు స్థాయిలో చట్టబద్ధంగా, ఎన్నిక పద్ధతి మీద స్వయం పరిపాలన పంచాయతీ సమితులను ఏర్పాటు చేయాలి.

3. పంచాయతీ సమితులకు సలహాల నిస్తూ, పర్యవేక్షణ జరుపటానికి ప్రజాప్రతినిధులతో జిల్లా పరిషత్తులను ఏర్పాటు చేయాలి.

జిల్లాల్లో అభివృద్ధి కార్యక్రమాలన్నిటికి సంబంధించిన సాధారణ పరిపాలనా వ్యవహారాల నన్నిటిని యీ ప్రజాస్వామిక వ్యవస్థలకు అంచెల వారీగా అప్పగించాలని ప్రభుత్వం సంకల్పిస్తోంది. ఈ పథకం సఫలం కావాలంటే ప్రజల సహకారం కావాలి. వివిధ కార్యక్రమాల్లో వారు చురుగ్గా పాల్గొనాలి. వారు స్వయం సహాయక తత్వాన్ని పెంపొందించుకుని తమ తీరిక సమయంలో కొంత భాగాన్ని మొత్తం సమాజ శ్రేయస్సుకై వినియోగించాలి. మన ప్రజలు కాలానుగుణంగా మారి విభేదాల్ని విస్మరించి, కలిసికట్టుగా పనిచేయ గలరు. అభివృద్ధి రంగాలన్నిటిలోను తగిన సత్ఫలితాల్ని సాధించ గలరు. ఆ విషయంలో నాకేమీ సందేహం లేదు.

ఇప్పుడు ప్రతి జిల్లాలోను ఒక్కొక్కటి చొప్పున అడ్ హాక్ పంచాయతీ సమితుల్ని నెలకొల్పుతున్నాం. పంచాయతీ సమితులను, జిల్లా పరిషత్తులను చట్టబద్ధంగా ఏర్పాటు చేయటానికి త్వరలో



కేంద్ర సమాజాభివృద్ధి శాఖామంత్రి శ్రీ ఎస్. కె. డే.

రాష్ట్ర శాసన సభలో ఒక బిల్లు ప్రవేశ పెట్టబడుతుంది. జయప్రదమైన యీ సమితుల నిర్వహణలో గడించిన అనుభవం, సంకల్పించిన బిల్లును రూపొందించుటలో ప్రభుత్వానికి మిక్కిలి తోడ్పడగలదు. స్థానిక నాయకత్వాన్ని పెర్పరచు కొనుటకు, నిజమైన బాధ్యతను నిర్వహించుటకు, క్రమంగా ఉన్నత ఎన్నిక పదవులకు సమర్థులగుటకు యీ సంస్కరణ గ్రామీణులకి తగిన అవకాశాల్ని సమకూర్చుస్తుంది. రాష్ట్రమంతటా పంచాయతీ సమితులేర్పడి, బ్లాకు స్థాయిలో నిజమైన ప్రజాస్వామిక సంస్థలు పని చేస్తున్నాయని ఆనందించే సుదినం ఎప్పుడు వస్తుందా అని నేను ఆతురతతో ఎదురు చూస్తున్నాను.

మన ద్వితీయ పంచవర్ష ప్రణాళిక విజయమేమి, ముందుముందు తయారు కాగల ప్రణాళికల విజయమేమి అధిక వ్యవసాయోత్పత్తి, పొదుపు ఉద్యమం, అభివృద్ధి కార్యక్రమాల్లో అధిక పెట్టుబడి పెట్టే మీద ఆధారపడివున్నవి. గ్రామాలు, పట్టణాల సౌభాగ్యం కూడా అధికోత్పాదక శక్తిపైనే ఆధారపడి వున్నది. మన ప్రజలు ముందడుగు వేస్తున్న రైతులను అమన

రించి, ఆధునిక విధానాల నవలంబిస్తారనీ, కష్టపడి పనిచేసి యెక్కువ పండిస్తారనీ, యెక్కువ డబ్బు సంపాదించి, యెక్కువ నిలవచేస్తారనీ ఆ విధంగా తాము బాగుపడి దేశానికి కూడా సహాయం చేస్తారనీ విశ్వసిస్తున్నాను.

అన్ని స్థాయిల్లోని ప్రభుత్వోద్యోగులూ కూడా ముఖ్యమైన పాత్ర వహించవలసి వుంది. కార్యక్రమాలను ఆరంభించే పూనిక ప్రజల్లోంచి ఉద్భవించేట్టు, ప్రజలే వాటిని స్వయంగా నిర్వహించేట్టు చూస్తూ ఆ విషయంలో తాము వారికి సాధ్యమైనన్ని విధాలా తోడ్పడాలి. ప్రజాసంస్థలు బలపడి, ఉత్తేజపడితే తప్ప, వాటికి దారి చూపిస్తూ, తోడ్పాటు నందిస్తూవుంటే తప్ప, సమాజ వికాస ఉద్యమం ఎప్పటికీ ప్రజల ఉద్యమం కాజాలదు. తన ఉత్తమ లక్ష్యాన్ని సిద్ధింప జేసుకొనలేదు. కూడా. ప్రభుత్వోద్యోగులు పరిపాలనా వ్యవస్థలో వస్తున్న మార్పును గుర్తించి ప్రజాసంస్థలను పోషించి, బలపరుస్తారని ఆశిస్తున్నాను.



రాష్ట్ర ప్రధాన కార్యదర్శి శ్రీ ఎమ్. పి. పాయ్.

పంచాయతీ సమితులు జయప్రదం కావాలనీ, మన ప్రజలకు శీఘ్ర విజయం సిద్ధించాలని కాంక్షిస్తున్నాను. "జై హింద్"

## రాష్ట్ర ప్రణాళికలు,

## అభివృద్ధి శాఖామంత్రి శ్రీ వి. బి. రాజు:

జిల్లాల్లో అభివృద్ధి కార్యక్రమాల రంగంలో ప్రజాస్వామిక వికేంద్రీకరణ సూత్రాన్ని అమలు జరపటంలో ప్రభుత్వం ఏదీ క్రొత్తపద్ధతిని అనుసరించటం లేదు. దీనిద్వారా మనదేశం చాలా కాలం క్రితమే మరచిదని నిశ్చయించుకున్న మార్గంలో మరొకఅడుగు ముందుకువేస్తున్నామంతే. అభివృద్ధి కార్యక్రమాల అమలులో ప్రజలు కార్యప్రారంభానశక్తి నికలిగి స్వయం సహాయం చేసుకోవాలనిపూర్వం కౌటిల్యుడుకూడా ఉద్ఘాటించాడు.దీనివే ప్లానింగు కమిషన్ ద్వితీయ పంచవర్ష ప్రణాళికలో నొక్కి చెప్పింది. సమాజాభివృద్ధి, జాతీయ విస్తరణ సేవాకార్యక్రమాలను శ్రీబల్వంత్‌రాయ్ మెహతా అధ్యక్షతన పరిశీలించిన సంఘం యీ సూత్రాన్నను సరించి, త్రిముఖ ప్రజాస్వామిక వికేంద్రీకరణను, అనగా గ్రామస్థాయిలో పునరుజ్జీవితమైన పంచాయతీలు, బ్లాకుస్థాయిలో పంచాయతీ సమితులని వ్యవహరింపబడే చట్టబద్ధమైన ఎన్నిక సంస్థలు, జిల్లాస్థాయిలో జిల్లా పరిషత్తులను సిఫార్సు చేసింది.

ఈ సిఫార్సులను సిద్ధాంత రీత్యా అంగీకరించి ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం జిల్లాకొక బ్లాకులో అడ్‌హాక్ పద్ధతిమీద యీ జూలై ఒకటవ తేదీన రాష్ట్రంలో 20 పంచాయతీ సమితులను ఏర్పాటు చేస్తోంది. ఈ సమితుల్లో బ్లాకులోని గ్రామ పంచాయతీల అధ్యక్షులు, మరికొంతమంది కో-ఆప్ట్ చేయబడిన ప్రతినిధులు సభ్యులుగా ఉంటారు. ఇప్పుడు రద్దు అయిపోయే బ్లాకు ప్లానింగు, అభివృద్ధి సంఘాల వ్యవహారాల నిర్వహణను యీసమితులు తక్షణం స్వీకరిస్తాయి. చివరకు అన్నిశాఖల అభివృద్ధి కార్యక్రమాల నిర్వహణ అది ఆయా బ్లాకులకు సంబంధించినంతవరకూ వీటికే అప్పగించ బడుతుంది. అభివృద్ధి కార్యక్రమాలకి సంబంధించిన డబ్బు,



రాష్ట్ర ఆర్థికశాఖామంత్రి శ్రీ కె. బ్రహ్మానందరెడ్డి 1-7-58 న మెదక్ జిల్లా పఠాన్ చెరువులో తాత్కాలిక పంచాయతీ సమితికి ప్రారంభోత్సవం చేశారు.

ప్రభుత్వపు గ్రాంట్లు, ప్రభుత్వ సహాయం, వివిధ అఖిల భారత సంస్థల సహాయం, ప్రజల సహాయం, ప్రజల విరాళాలు, యీ సమితులకు ఆదాయ వసతులుగా ఉంటాయి. బ్లాకు అభివృద్ధి అధికారి ఎక్కువ అధికారాలతో సమితి ముఖ్యకార్య నిర్వాహక అధికారిగా ఉంటాడు. ఈ సమితులకు పునాది గ్రామ పంచాయతీలు. కాబట్టి వీటి విజయం పంచాయతీలు, ప్రజలుఇచ్చే. సహకారంపై ఆధారపడి ఉంటుంది. ఈ విధానం ప్రాముఖ్యాన్ని జిల్లాల ప్రజలు గుర్తించి యీ సమితుల విజయానికి పూర్తిగా తోడ్పడతారని ఆశిస్తున్నాను. అలాగే అందుకు సంబంధించిన అధికారులందరూ కూడా యీ కొత్తసంస్థలకి ఉత్సాహంతో సహకరిస్తారనీ, తద్వారా ప్రజాస్వామిక వికేంద్రీకరణ సూత్రాన్ని త్వరలో మన రాష్ట్రం అన్నిబ్లాకుల లోను అమలు పరచగలమనీ విశ్వశిస్తున్నాను.

## రాష్ట్ర స్థానిక పరిపాలనశాఖా మంత్రి:

1958 జులై 1వ తేదీ ఆంధ్రప్రదేశ్ చరిత్రలో సువర్ణాక్షరములతో లిఖింపదగినది. రాష్ట్రంలో నిర్ణీతమైన 20 బ్లాకులలో పంచాయతీ సమితుల స్థాపనద్వారా, జిల్లా పరిపాలనా వ్యవస్థలో ప్రజాస్వామిక వికేంద్రీకరణ విధానమును ప్రయోగాత్మకంగా నేడు ప్రారంభిస్తున్నాం. ఈ సమితులు గ్రామప్రాంతాలలోని ప్రజలలో స్వయం సహాయం, కార్యారంభాసక్తుల్ని పురికొల్పి వారి కార్యోత్సాహాన్ని సద్వినియోగ పరచుకోగలవని విశ్వసిస్తున్నాను.

ఈపథకం జయప్రదం కావాలని కాంక్షిస్తున్నాను

## కేంద్ర సమాజాభివృద్ధిశాఖామంత్రి శ్రీ ఎస్. కె. దే:

భారతదేశంలోని రాష్ట్రాలలో వర్ణక్రమానుసారంగా ఆంధ్రరాష్ట్రం ప్రథమ స్థానమలం

కరిస్తున్నది. రాష్ట్రాల పునర్వ్యవస్థీకరణ పథకంలో కూడా మొట్టమొదటి భాషా ప్రయుక్త రాష్ట్రంగా ఆంధ్రరాష్ట్రమే ప్రథమ స్థానమలం కరిస్తున్నది. పునర్వ్యవస్థీకృతమైన రాష్ట్రాల పథకంలో ప్రభుత్వోద్యోగులు, పరిపాలనావ్యవస్థల విలీన కార్యక్రమంలో కూడా బహుశా ఆంధ్రరాష్ట్రమే ప్రథమరాష్ట్రం. వర్తమాన అత్యవసర పరిస్థితుల కనుగుణంగా తమ శక్తిని కేంద్రీకరించి పనిచేయుటకు ఆంధ్రులు నిరంతరాయంగా కృషిచేస్తారు. అలా కృషిచేయడంలో వారు తమ హృదయమార్గాన్ని, బుద్ధిచాతుర్యాన్ని రెండిటినీ జోడిస్తారు. ఆంధ్రప్రజా జీవిత స్పందన నుంచి నేను అర్థం చేసుకున్న దాన్ని బట్టి యీ విషయాలు చెబుతున్నాను.

1947 ఆగస్టు 15వ తేదీ అర్థరాత్రి సమయాన భారతదేశానికి స్వాతంత్ర్యం లభించినప్పుడు, అధికారం ఢిల్లీ హస్తగతమయింది. అక్కడి నుంచి అది రాష్ట్ర రాజధానులకి పయనించింది. ప్రజాస్వామ్యం వాస్తవం కావాలంటే అది నెమ్మదిగానైనా క్రమంగా అది యే ప్రజలదో ఆ ప్రజల హస్తగతం కావాలి.

ఈ సంపూర్ణ కార్యక్రమానికి ఓం ప్రథమంగా ఆంధ్రరాష్ట్రం ఉపక్రమిస్తున్నందునూ, రాష్ట్ర మంతటా యీ కార్యక్రమాన్ని అమలు పరచటానికి ఉద్యుక్తమై యున్నందుననూ, ఆంధ్ర రాష్ట్ర ప్రభుత్వమును ఆంధ్ర పౌరులనూ అభినందించవలసి యున్నది. ఈ కొత్త వెలుగు దశదిశలు వ్యాపించుగాక. ఈ కాంతి సర్వత్రా వ్యాపించి ప్రస్తుతం మారుమూలల్లో అంధకారంలో ఉన్న ప్రదేశాలన్నిటినీ కూడా దేదీప్యమానం జేసే వరకూ మనమందరం - అంటే ప్రజలు, ప్రజామిత్రులు, ప్రజాప్రతినిధులు, ప్రజలకు సేవజేస్తున్న ప్రభుత్వోద్యోగులు - అంతా కూడా అకుంఠిత విశ్వాసంతో, పరస్పర అవగాహనతో, కృషిచేయుదుముగాక.



రాష్ట్ర ముఖ్యమంత్రి

## రాష్ట్ర ప్రధాన కార్యదర్శి శ్రీయం. పి. పాయ్:

నేటి బ్లాకు సమితుల ప్రారంభోత్సవం దేశపురోగమన పథంలో ఒక ముఖ్య ఘట్టం. మన పంచవర్ష ప్రణాళికలో ఒక ముఖ్యభాగమైన సమాజాభివృద్ధి కార్యక్రమం లక్ష్యం జాతీయ ఆదాయాన్ని పెంచి గ్రామ సీమలలో ప్రజల జీవన ప్రమాణాలను సత్వరంగా అభివృద్ధిచేయటం. మన దేశ జనాభాలో గ్రామప్రజలు అత్యధిక సంఖ్యాకులు. కాబట్టి వారి అభ్యుదయానికి, ఆరోగ్యానికి, విద్యా సంస్కృతులకి, పూర్తి ఉద్యోగ కల్పనకిదోహద పడని అభివృద్ధి కార్యక్రమాలకు అర్థమే లేదు. ఇట్టి అభివృద్ధి సాధన ప్రధానంగా ప్రజల చేతిలో వున్నదనే విషయాన్ని గుర్తించుటవల్లనే నేడు గ్రామసీమల పరిపాలనా వ్యవస్థలో మార్పు తేబడుతున్నది.

శతాబ్దాలనుంచీ జాతి సుస్థిరత్వమూ, శ్రేయస్సు గ్రామ సమాజాలపై ఆధారపడి వున్నాయి. ఇవి దృఢంగా, వుండి,జీవంతో తొణికిసలాడుతున్నంత వరకూ ఆ మేరకు దేశమూ అభివృద్ధిచెందింది. గ్రామ

సమాజాలు క్షీణించి కుంగిపోవటంతో నగరాల సౌష్ఠవమూ, సంపద సన్నగిలినవి. ఇరుగు పొరుగు సాన్నిహిత్యం, ఉమ్మడి అవసరాలు, సార్వజనీన ప్రయోజనాలు వీటి మూలంగా మన గ్రామ సమాజాలు ఒక విధంగా భారీ ఉమ్మడి కుటుంబాలలా ఉన్నాయి. అంతా ఐకమత్యంతో ఉన్నంతసేపు అవి అభివృద్ధి చెందుతాయి. భేదాలు వచ్చాయా, క్షీణించిపోతాయి. నేటి అవసరాల కనుగుణంగా మళ్లీ గ్రామజీవితాన్ని ఉత్తేజితం చేయపూనుకున్నాం. పరస్పర సహకారం, స్వయం సహాయాల ద్వారానే గ్రామీణులు వ్యవసాయం, పశుపోషణ మున్నగు రంగాల్లో వివిధ కార్యక్రమాలను అమలు జరుపగలుగుతారు. కాబట్టే పంచాయతీ పరిపాలన మళ్లీ దేశపరిపాలనా వ్యవస్థలో ఒక ముఖ్య భాగం కాగలుగుతున్నది.

అభివృద్ధి, ప్రజాస్వామ్యం గ్రామస్థాయిలో ఆరంభమవాలి. అందుకే స్థానిక పరిపాలనా బాధ్యత పంచాయతీ సమితులకప్పగించబడుతోంది. ప్రస్తుత దేశపునర్నిర్మాణపు ఉద్యమంలో పంచాయతీల ప్రాముఖ్యాన్ని మనము గుర్తించాలి. మన గ్రామాలు, వాటి పంచాయతీలు ఉన్నత జీవన ప్రమాణాల్ని కాంక్షిస్తే, వాటి సిద్ధికోసం అవి సాధ్యమైనంత యెక్కువ ఉత్పత్తిని సాధించడానికి కృషిచేయాలి. తక్షణావసరాలకి అవసరం లేని ప్రతి పైసను మిగల్చాలి. తీరిక సమయం యావత్తుని సమాజావసరాల నెదుర్కోడానికి ఉపయోగించాలి నిన్నటి విభేదాల్ని మరచి రేపటి ఆశలు, ఆశయాల సిద్ధికై పాటుపడాలి.

పంచాయతీ సమితులు ప్రారంభమయ్యే శుభ ముహూర్తం ఇది. యీ సమయంలో మిగిలిన వారందరితో పాటు సమాజాభివృద్ధి కార్యక్రమాలతో సంబంధంవున్న వారందరం సమితులు జయప్రదం కావాలనీ, సమిష్టికృషితో భవిష్యత్తులో సుఖసంపదలు వర్ధిల్లాలనీ కాంక్షిస్తున్నాం.

## పంచాయతీ సమితుల నిర్మాణం

పంచాయతీ సమితిలో దిగువ సభ్యులుంటారు:

1. తెలంగాణా ప్రాంతంలో పట్టణసంఘాల అధ్యక్షులతోసహా గ్రామ పంచాయతీల అధ్యక్షులందరూ;
2. పంచాయతీ లేని ప్రతి గ్రామంనుంచి జిల్లా కలక్టరుచే నియమింపబడే ఒక ప్రతినిధి.
3. కో-ఆప్టు చేయబడే సభ్యులు ఐదుగురు:— i. ఒక స్త్రీ. ii. షెడ్యూల్డు కులాలు, జాతుల ప్రతినిధి, iii. ఆ అభివృద్ధి కేంద్రంలో పనిచేసే సహకార సంస్థలలో ఒకదాని డైరెక్టరు, iv. ఆ కేంద్రంలోని రూఢైన సాంఘిక సేవకులు, ప్రసిద్ధ ఆర్థిక వేత్తలు, ప్రజాసేవకులనుంచి కో-ఆప్టు చేసుకోబడే వారిద్దరు

శాసనసభ్యులు తమ నియోజకవర్గంలోని సమితి సమావేశాలకి హాజరయి, చర్చలలో పాల్గొనవచ్చు. సమితి సభ్యులకి సలహా యివ్వవచ్చు. అయితే



రాష్ట్ర ప్రణాళికలు, అభివృద్ధి శాఖామంత్రి శ్రీ వి. బి. రాజు

వారు ఎక్స్ అఫిషియో సభ్యులు కాకుండా కాని లేక కోఆప్టు చేయబడకుండాకాని ఓటు చేయరాదు. అధ్యక్ష, ఉపాధ్యక్ష పదవుల యెన్నికలకి నిలబడరాదు.

అధ్యక్షునికి అవకాశమిస్తారు. సమితి సభ్యులలో యెవరేనా గ్రామ పంచాయతీ లేక పట్టణసంఘం (తెలంగాణా ప్రాంతంలో), అధ్యక్ష పదవినుంచికాని లేక సహకార సంఘం డైరెక్టరు పదవినుంచికాని



రాష్ట్ర స్థానికపరిపాలన, కార్మిక శాఖామంత్రి శ్రీ డి. సంజీవయ్య

నిశ్చితమైన అభివృద్ధి కేంద్రాలలో పంచాయతీలు లేని గ్రామాలలో వాటి నిర్మాణానికై సత్వర చర్యలు గైకొన బడతాయి. అంతవరకూ అట్టి గ్రామాలకి ప్రాతినిధ్యమిచ్చుటకై అట్టి రెవిన్యూ గ్రామాలలో ప్రతిఒక్క దానినుంచి జిల్లాకలెక్టరు తగిన ప్రతినిధిని నియమిస్తారు. అట్టి గ్రామాలకి చట్టబద్ధమైన పంచాయతీ యేర్పడిన పిమ్మట ఆ ప్రతినిధి వైదొలగి సమితిలో ఆ పంచాయతీ విరమిస్తే దానితో పాటు సమితిలో వారికిగల సభ్యత్వంకూడా పోతుంది. అలా ఖాళీఅయిన స్థానాన్ని, పంచాయతీ, పట్టణసంఘం, లేక సహకార సంస్థలో వారి తరువాత పదవిలోకొచ్చిన వారు ఆక్రమిస్తారు.

పైచెప్పిన ప్రకారం సభ్యుల్ని కోఆప్టు చేసుకొనటకై ఎక్స్ అఫిషియో సభ్యులు (పంచాయతీలు, పట్టణసంఘాల అధ్యక్షులు), నియమించ బడిన



నెల్లూరు జిల్లా ఇందుకూరు పేట తాత్కాలిక పంచాయతీ సమితికి 1-7-58 న జిల్లా కలక్టరు శ్రీ వి. శ్రీనివాసాచారి, ఐ ఏ. ఎస్., ప్రారంభోత్సవం చేశారు. ఆ సందర్భంలో లోకసభ్యుడు శ్రీ రేబాల లక్ష్మీనరసింహా రెడ్డి అధ్యక్షత వహించారు.



కడప జిల్లా పోరుమామిళ్ల పంచాయతీ సమితి అధ్యక్షుడు శ్రీ అవధానం వెంకట సుబ్బయ్య 1-7-58 వ సభలో ప్రసంగిస్తున్న దృశ్యం.

సభ్యుల (పంచాయతీలు లేని గ్రామాల ప్రతినిధులు) సమావేశాన్ని జిల్లా కలక్టరుకాని లేక ఆయన తరఫున రెవిన్యూ డివిజనల్ ఆఫీసర్ కాని లేక అందుకు సంబంధించిన డిప్యూటీ కలక్టరుకాని యేర్పాటు చేస్తారు. కోఆప్టు అయిన సభ్యులతో సహా అడ్ హాక్ పంచాయతీ సమితి సభ్యులు తమనుంచి అధ్యక్ష, వుపాధ్యక్షుల్ని యెన్నుకుంటారు. సమితికి సభ్యులు కోఆప్టు అయినపిమ్మట సాధ్యమైనంత త్వరలో అభివృద్ధి కేంద్రంపై ఆధ్వర్యంగల రెవిన్యూ డివిజనల్ ఆఫీసర్ లేక డిప్యూటీ కలక్టరు యెన్నికని జరిపిస్తారు. ప్రతి సమితికి దిగువస్థాయి సంఘాలుంటాయి. ఒక్కొక్కదానిలో సమితి అధ్యక్షుడితోసహా ఏడుగురు శాశ్వత సభ్యులుంటారు. సమితి అధ్యక్షుడు యీ సంఘం అధ్యక్షుడుగా వుంటాడు. వీరుగాక సభ్యులు కానివారిద్దరుంటారు. వారుండడం వాంఛనీయమని భావించబడితే సమితిచే వారు ప్రత్యేకం కోఆప్టు చేయబడతారు.

1. వ్యవసాయం, పశుసంపద, చిన్నరకం నీటి పారుదల అభివృద్ధి విషయాల స్థాయిసంఘం.
2. కుటీర పరిశ్రమలు, సహకారాల అభివృద్ధి, సంఖ్యా వివరాల సేకరణలకి సంబంధించిన స్థాయి సంఘం.
3. విద్య, ఆరోగ్యం, సాంఘిక సంక్షేమాల అభివృద్ధి విషయాల స్థాయిసంఘం.
4. ఆర్థిక వ్యవహారాల స్థాయిసంఘం.

సమితి 3 నెలలకొకసారిగాని లేక అవసరమైతే అంతకంటె తరుచుగాకాని సమావేశ మవుతుంది. దాని స్థాయిసంఘాలు అవసరమైనంత తరుచుగా సమావేశమవుతాయి. సమితి లేక స్థాయి సంఘం సమావేశం జరగడానికి నిర్ణీతమైన సభ్యుల సంఖ్యలో అధమం మూడోవంతు హాజరు కావాలి. సమితి దాని అధ్యక్షుడు యెన్నికయిన తేదీనుంచి ఒక సంవత్సరం లేక దానిస్థానే చట్టబద్ధమైన మరో పంచాయతీ సమితి యేర్పాటయే పర్యంతం యీ రెండిటిలో యేది ముందయితే అంతవరకూ అధికారంలో వుంటుంది.

సమితి అభివృద్ధి కేంద్రంలో ప్రస్తుతమున్న బ్లాకు ప్లానింగు, అభివృద్ధి సంఘాలు సమితి సభ్యుల్ని కోఆప్టు చేసుకోడానికి సమావేశమైన తేదీనుంచి పని చేయవు.

సిద్ధాంతరీత్యా, ప్రభుత్వశాఖల అభివృద్ధి కార్యక్రమాలన్నిటిని అవి ఆయా సమితుల అభివృద్ధి కేంద్రాలకి సంబంధించినంతవరకు తుదకి వాటి కప్పగించాలి. సమితులు బ్లాకుప్లానింగు, అభివృద్ధి సంఘాల ప్రస్తుత పు పనుల్ని తీసుకుంటాయి. అభివృద్ధిశాఖలు సాధ్యమైనంత త్వరలో వాటికి అదనపు పనుల్ని బదిలీ చేస్తాయి. పరిశీలనార్థం తమతమ బడ్జెట్టులను సమితులకి సమర్పించమని సమితి కేంద్రాలలోని పంచాయతీలకి సలహా యివ్వబడుతున్నది. సమితులేమైనా సూచనలు చేస్తే పంచాయతీలు సాధ్యమైనంతవరకూ వాటిని అంగీకరించాలి.

## ఆదాయం

అడ్ హాక్ పంచాయతీ సమితులకి ఆదాయం దిగువ మార్గాలలో లభిస్తుంది.

1. సమితికి బదిలీ అయిన అభివృద్ధిశాఖల పథకాలకి సంబంధించిన సొమ్ము.
2. ఒక ప్రాంతం వెనుకబడి వుండుటను బట్టి ప్రభుత్వం యిచ్చే గ్రాంట్లు.సమాజాభివృద్ధి కార్యక్రమానికి సంబంధించిన సొమ్ము కూడా దీనిలో చేరివుంటుంది.
3. కుటీర, గ్రామ పరిశ్రమలు, ఖాదీ వగైరాల నిమిత్తం ప్రభుత్వం, అఖిల భారత సంస్థలు చేసే సహాయం.

అడ్ హాక్ పంచాయతీ సమితులు సమర్పించిన అభివృద్ధి కేంద్రం బడ్జెట్టుల్ని జిల్లా పరిషత్తులు యేర్పడే వరకూ జిల్లా కలక్టర్లు పరిశీలిస్తారు. సమితులు చేసిన తీర్మానాలు ప్రభుత్వాదేశాలకి కాని లేక భారత రాజ్యాంగానికి కాని వ్యతిరేకంగా వున్నా లేక శాంతి భద్రతలకి భంగకరాలుగావున్నా అవి అమలు జరుగకుండా జిల్లా కలక్టర్లు ఆపుచేయ

వచ్చు. ప్రభుత్వం వాటిని రద్దు చేయ వచ్చు. అధ్యక్షుడికి లేక వుపాధ్యక్షుడికి సమితి వ్యవహార నిర్వహణకి తగిన సమర్థత లేదని కాని లేక వారు దాని సక్రమ నిర్వహణకై చేసిన సాధారణ వుత్తర్వుల్ని అమలు జరపడం లేదని లేక వుల్లంఘిస్తున్నారని ప్రభుత్వం భావిస్తే వార్ని తొలగించవచ్చు. అలాగే సమితికి దాని కప్పగించిన బాధ్యతల్ని నెరవేర్చే సామర్థ్యం లేదని కాని లేక అస్తమానం తప్పులు చేస్తున్నదని కాని లేక అధికారాన్ని దుర్వినియోగం చేస్తున్నదని కాని ప్రభుత్వం భావిస్తే దానిని రద్దు చేసి, కొంతకాలం వరకూ పరిపాలనా బాధ్యత ప్రత్యేకాధికారి కప్పగించ బడాలని ఆదేశించ వచ్చు.

పథకాల అమలులోనేమి, వారిసూచనల అమలులోనేమి సమితులతో సహకరించడుని సమితి కేంద్రాలలోని గ్రామ పంచాయతీ లన్నిటికి సలహా యివ్వబడు తున్నది.

## సిబ్బంది

బ్లాక్ అభివృద్ధి అధికారి ఆడ్‌హాక్ పంచాయతీ సమితి ప్రధాన కార్య నిర్వహణాధి కారిగా వుండి సమితి తీర్మానాల అమలుకి బాధ్యత వహిస్తాడు. అభివృద్ధి కేంద్రాలలో పని చేస్తున్న యితర అభివృద్ధి శాఖల సిబ్బంది సమితులకి బదిలీ అయిన కార్యక్రమాల విషయంలో బ్లాక్ అభివృద్ధి అధికారి క్రింద పని చేస్తారు. జిల్లా అధికార్లు సాంకేతిక విషయాల అజమాయిషీని చూస్తారు. సాంకేతిక విషయాలలో అవసరమైన సహాయాన్ని కూడా వారు చేస్తారు.

బ్లాక్ అభివృద్ధిఅధికారి ప్రాథమికఆరోగ్య కేంద్రానికి అధ్వర్యం వహించే వైద్యాధికార్ని తప్ప అభివృద్ధి కేంద్రం స్థాయిలో పనిచేసే మిగిలిన సిబ్బందిని మందలించ వచ్చు. ఇందుకు ఆయా శాఖాధిపతులతో కాని లేక జిల్లా అధికారులతో కాని సంప్రదించ నవసరం లేదు. అందుకు సంబంధించిన శాఖ జిల్లా అధికారితో ముందుగా సంప్రదించి ఇంక్రిమెంట్లను ఆపవచ్చు. ఈ రెండు శిక్షలూ కాక యితర శిక్షల్ని తగిన డిపార్టుమెంటల్ అధికారి వెయ్యాలి.

గ్రామస్థాయిలో పనిచేసే సిబ్బంది విషయంలో బ్లాక్ అభివృద్ధి అధికారి అన్ని శిక్షల్నీ వెయ్యవచ్చు. అయితే వుద్యోగంనుంచి తొలగింపు, బర్తరఫుల విషయంలో మాత్రం అతని కధికారంలేదు. ఆ అధికారం జిల్లాకలక్టరికి వుంటుంది.

## శిక్షణ

సమితి సభ్యులకి పరిపాలనా విషయాలలోను, సమాజాభివృద్ధి విషయంలోను సామర్లకోట, రాజేంద్ర సాగర్‌లలో ఒక వారం రోజులపాటు తగిన శిక్షణ యివ్వబడుతుంది.

సమితి లేక దాని స్థాయి సంఘం సమావేశానికి హాజరయిన ప్రతి సభ్యునికి రోజుకి రూ 5/- చొప్పున భత్యం యివ్వబడుతుంది. ఈ విషయంలో ప్రయాణ దూరం యెంతయినా సరే, అది లెఖ్ఖలోకి తీసుకోబడదు.

## ఆడ్‌హాక్ పంచాయతీ సమితులు యేర్పడిన అభివృద్ధి కేంద్రాలు

| జిల్లా | అభివృద్ధి కేంద్రం పేరు | స్వభావం (సమాజాభివృద్ధి కేంద్రమా లేక జాతీయ వికాస సేవాకేంద్రమా లేక అనంతర తీవ్రకృషి కేంద్రమా. |
|---|---|---|
| 1 | 2 | 3 |
| **ఆంధ్ర ప్రాంతం** | | |
| 1. శ్రీకాకుళం | గార | సమాజాభివృద్ధి |
| 2. విశాఖపట్నం | కోటవురట్ల | సమాజాభివృద్ధి |

| 1 | 2 | 3 |
|---|---|---|
| 3. తూర్పుగోదావరి | కొత్తపేట | జా. వి. సే. |
| 4. పశ్చిమ గోదావరి | మలకపల్లి | జా. వి. సే. |
| 5. కృష్ణా | నూజవీడు | సమాజాభివృద్ధి |
| 6. గుంటూరు | నాదెండ్ల | జా. వి. సే. |
| 7. నెల్లూరు | ఇందుకూరుపేట | జా. వి. సే. |
| 8. చిత్తూరు | కలికిరి | అనంతర తీవ్రకృషి |
| 9. కడప | పోరుమామిళ్ల | జా. వి. సే. |
| 10. అనంతపురం | కొడిగెన హళ్లి | సమాజాభివృద్ధి |
| 11. కర్నూలు | మోదుమూరు | జా. వి. సే. |

## తెలంగాణా ప్రాంతం

| | | |
|---|---|---|
| 1. హైదరాబాదు | మేడ్చల్ | సమాజాభివృద్ధి |
| 2 నల్గొండ | భోనగిరి | జా. వి. సే. |
| 3. వరంగల్లు | మహబూబాబాదు | జా. వి. సే. |
| 4. ఖమ్మం | కల్లూరు | జా. వి. సే. |
| 5. మెదక్ | పఠాన్ చెరువు | సమాజాభివృద్ధి |
| 6. మహబూబునగరం | షాద్‌నగర్ | సమాజాభివృద్ధి |
| 7. నిజామాబాదు | బన్సవాడ | అనంతర తీవ్రకృషి |
| 8. ఆదిలాబాదు | లక్సెట్టి పేట | జా. వి. సే. |
| 9. కరీంనగరం | గంగధార | సమాజాభివృద్ధి |

### పంచాయతీ సమితుల పనులు

గ్రామీణులలో స్వయం సహాయ దృక్పథాన్ని పెంపొందించుటకును, వారి జీవన ప్రమాణాన్ని హెచ్చించుటకును ప్రజల కార్యోత్సాహాన్ని సమీకరించుటకై అడ్ హాక్ పంచాయతీ సమితులు కృషి చేస్తాయి. ప్రభుత్వశాఖల అభివృద్ధి కార్యక్రమాలు అవి ఆయా బ్లాకులకి సంబంధించినంత వరకూను, ఎంతవరకూ అవసరమూ వాంఛనీయమూ అని ప్రభుత్వం భావిస్తుందో అంతవరకూను అడ్ హాక్ పంచాయతీ సమితులకి అప్పగించ బడతాయి.

### వ్యవసాయం

2. పంచాయతీ సమితులకి రసాయన యెరువుల జిల్లా కోటానుంచి ప్రత్యేకమైన కోటాలు కేటాయించబడతాయి. అభివృద్ధి కేంద్రంలో సహకార సంస్థలద్వారా జరిగే రసాయన యెరువుల పంపిణీని అవి నిక్రమ పరుస్తాయి. అందుకు అవసరమైన సౌకర్యాలు వాటికి కల్పించబడతాయి.

3. అవసరమైన చోటెల్లా అద్దె-కొనుగోలు పద్ధతిక్రింద అప్పులుసమితులకి ప్రత్యేకం కేటాయించబడతాయి. సాగునీటి సరఫరా నిమిత్తంఅద్దెకివ్వడానికి ప్రత్యేకం కొన్ని ఆయిల్ ఇంజన్లు వాటి అధికారంక్రింద వుంచబడతాయి.

4. ఈ సమితులు:

i రైతులికి యెన్ని విత్తనాలు అవసరమో తెలుసుకుంటాయి.

ii విత్తనాల వుత్పత్తి క్షేత్రాల ప్రారంభానికై ఆధునిక పద్ధతుల నవలంబించే రైతులను యెన్నుతాయి.



అదనపు అభివృద్ధి కమిషనరు శ్రీ సి. నరసింహంగారు తాత్కాలిక పంచాయతీ సమితి బ్లాకుకి ప్రారంభోత్సవం చేశారు.

iii ప్రభుత్వ శాఖ సరఫరా చేసిన వుత్తమ (న్యూక్లియస్) విత్తనాలను యెక్కువగా పండిస్తాయి.

iv విత్తనాలను సేకరించి, అభివృద్ధి కేంద్రంలోని రైతులికి పంపిణీ చేస్తాయి.

v ఈ సందర్భంలో అవసరమైన బాండ్లపై సంతకం చేసే అధికారం బ్లాకు అభివృద్ధి అధికారికి యివ్వబడుతుంది.

5. అప్పుల మంజూరు సందర్భంలో, దరఖాస్తుల్ని ప్రభుత్వశాఖకి చెందిన యేజన్సీ కాక అభివృద్ధి కేంద్రం సిబ్బంది లేక అంతకంటె వీలుగా బ్లాకు అభివృద్ధి అధికారి పరిశీలిస్తారు.

6. మొక్కల రక్షణ కార్యక్రమం గ్రామ పంచాయతీలకు, సహకార సంఘాలకి అప్పగించబడుతుంది మొక్కల రక్షణ పరికరాల్ని, మందుల్ని సరఫరా చేయుట కవసరమైన యేర్పాట్లను పంచాయతీ సమితులు చేయాలి. ఇందుకు అవి సొమ్మును దానికి కేటాయించిన డిపార్టుమెంటల్ ఫండ్సు లేక బ్లాకు బడ్జెట్టు నుంచి తీసుకోవాలి. క్రిమి సంహారకమైన మందుల ఖరీదును వాటివల్ల లాభం పొందిన వారినుంచి రాబట్టాలి.

7. ఈ సమితులు వ్యవసాయ కార్యక్రమాన్ని (డిపార్టుమెంటు, బ్లాకు రెండింటికి చెందినది) పూర్తిగా అమలు పరచగలిగితే, డిపార్టుమెంటల్ పథకాల అమలుకై డిపార్టుమెంటల్ బడ్జెట్టులో చేసిన కేటాయింపులు వాటి అధికారం క్రింద వుంచబడతాయి.

### పశుపోషణ

8. పంచాయతీ సమితులకి దిగువ పనులు అప్పగించబడతాయి.

i ఆయా ప్రాంతాలకు కేటాయించబడిన అబోతు పోషణ, గుడ్లు పొదిగే కేంద్రాలు, పశువుల ప్రథమ చికిత్సా కేంద్రాలు, చిన్న రకం వెటర్నరీ డిస్పెన్సరీలు, కృత్రిమ పిండోత్పత్తి కేంద్రాలు మున్నగువాటి యేర్పాటు.

ii కొత్త వెటర్నరీ సెంటర్లు, కృత్రిమ పిండోత్పత్తి కేంద్రాలు మున్నగువాటి ప్రారంభం.

iii ఆయా ప్రాంతాలలో పశువైద్యం, పశుగణాల అభివృద్ధికై విరాళాల సేకరణ.

iv అభివృద్ధి కేంద్రాలలోని గుడ్లు పొదిగే కేంద్రాలనుంచి పంపిణీకై పిట్టల, గుడ్ల ధర నిర్ణయం.

v పశుపోషణ నిమిత్తం పెరాశ మివ్వబడిన భవనాలను స్వాధీనం చేసుకుని, వాటి నిర్వహణ బాధ్యతను వహించడం.

### సహకారం

9. దిగువ రెండు పనులు పంచాయతీ సమితులకి బదిలీ చేయబడతాయి.

i అభివృద్ధి కేంద్రాలలో సహకార సంస్థల యేర్పాటు విషయమై సిఫార్సు చేయడం.

ii సహకార సంఘాలకి ప్రభుత్వం నుంచి అప్పులు, గ్రాంట్ల రూపంలో లభించే సహాయం విషయంలో సిఫార్సు చేయడం.

### సాంఘిక సంక్షేమం

10. దిగువ పనుల్ని పంచాయతీ సమితులకి అప్పగించి, అందు కవసరమైన సొమ్ము వాటి అధికారం క్రింద వుంచబడుతుంది.

i సాంఘిక సంక్షేమ పాఠశాలలు.

ii సాంఘికసంక్షేమ వసతి గృహాలు.

iii వెనుకబడ్డ కులాల గృహవసతి పథకాలు.

iv వెనుకబడ్డ కులాలకై బావులు త్రవ్వడం.

v మాజీనేరస్థ జాతుల వసతి గృహాలు, పాఠశాలలు.

vi మాజీనేరస్థ జాతుల గృహ వసతి పథకాలు

vii మాజీ నేరస్థ జాతులకై బావులు త్రవ్వడం.

### స్త్రీ సంక్షేమం

11. స్త్రీ, శిశు సంక్షేమ కేంద్రాల నిర్వహణ.

### విద్య

12. దిగువ మూడు పనులు, అవి అభివృద్ధి కేంద్రాలలో ప్రభుత్వం నిర్వహించే సంస్థలకి సంబంధించి నంతవరకూ యీ సమితులకి అప్పగించబడతాయి.

i ప్రాథమిక పాఠశాలల నిర్వహణ యీ సమితులకి బదిలీ చేయబడుతుంది. అవి ఆ పాఠశాలల నిర్వాహకులుగా గుర్తించబడతాయి.

ii ప్రాథమిక పాఠశాలలకి సంబంధించిన అన్ని ఎస్టాబ్లిష్‌మెంటు విషయాలకి, వుపాధ్యాయుల నియామకం, బదిలీలు, వారి సెలవు మంజూరులకు సంబంధించిన అధికారాలు యీ సమితులకు, సిబ్బంది రిక్రూటుమెంటు, డిసిప్లినరీ కంట్రోలుల విషయంలో నిర్ణీతమైన నిబంధనలకు లోబడి, యివ్వబడతాయి.

iii ప్రభుత్వం నడిపే సెకండరీ పాఠశాలల పరిపాలనాధికారం (అడ్మినిస్ట్రేటివ్ కంట్రోలు) యీ సమితులకు బదిలీ చేయబడుతుంది. సిబ్బంది బదిలీలు మున్నగు వ్యవహారాలు మాత్రం యథా ప్రకారం జిల్లా స్థాయిలో విద్యాశాఖ డైరెక్టరు లేక ఆయన క్రింది వుద్యోగులచే జరుపబడతాయి.

### సంఖ్యా వివరాల సేకరణ

13 దిగువ అంశాలకి సంబంధించిన సంఖ్యా వివరాలను సేకరించే కార్యక్రమం యీ అడ్‌హాక్ పంచాయతీ సమితులకు బదిలీ చేయబడుతుంది. ఇప్పుడు యీ వివరాల్ని సేకరిస్తున్న యేజన్సీలు యికముందు వాటిని యీ సమితులకి కూడా సరఫరా చేయాలి.

i వైటల్ స్టాటిస్టిక్సు.

ii ధరల సంఖ్యావివరాలు - కోసిన పంటధరలు చిల్లర వ్యవసాయ ధరలు.

iii వ్యవసాయ వేతనాలు.

iv వివిధ పంటల క్రింద వున్న ప్రదేశం.

v ప్రధాన ఆహార, ఆహారేతర పంటలు కాని పంటల వుత్పత్తికి సంబంధించిన సంఖ్యా వివరాలు - ప్రతి పంటకీ సంబంధించిన మామూలు వుత్పత్తి మున్నగు వివరాలు.

vi సాగనీటి సరఫరాకి సంబంధించిన సంఖ్యా వివరాలు.

vii వ్యవసాయం పనుల్లో ప్రతినెలా జరిగే అభివృద్ధి.

## 14. ప్రజారోగ్యం

i ప్రాథమిక ఆరోగ్య కేంద్రాలు గల బ్లాకులలో మాత్రమే టీకాలు వేసే బాధ్యత, ప్రజారోగ్యశాఖ డైరెక్టరు, జిల్లా ఆరోగ్యాధికార్ల సాంకేతిక అజమాయిషీకి లోబడి, సమితుల కప్పగించబడుతుంది.

ii ప్రాథమిక ఆరోగ్య కేంద్రాలు సమితుల క్రింద పని చేస్తాయి. అయితే వాటి అంతరంగిక వ్యవహారాల బాధ్యతని వైద్యాధికారి, మొత్తం అజమాయిషీ బాధ్యతని ప్రజారోగ్య శాఖ, వైద్యశాఖల డైరెక్టర్లు, వాటి జిల్లా అధికార్లు వహిస్తారు.

iii ప్రస్తుతం జనన మరణాల వివరాలను నమోదు చేస్తున్న సంస్థ,అభివృద్ధి కేంద్రంలోని గ్రామాల విషయంలో నెలసరి నివేదికల ప్రతుల్ని సమితులకి పంపవలసి వుంటుంది.

iv బ్లాక్ అభివృద్ధి అధికారి మొత్తం ఆరోగ్య కార్యక్రమానికంతకీ ఆధ్వర్యం వహిస్తాడు. అయితే సాంకేతిక విషయాలలో ఆయా జిల్లా అధికార్లకి అధికారముంటుంది.

## 15. గ్రామీణ గృహవసతి

i బ్లాక్ అభివృద్ధి అధికార్లు గ్రామీణ గృహవసతికై అప్పుల్ని పంపిణీ చేస్తారు. వాటిని వసూలు చేస్తారు.

ii ఇచ్చిన అప్పులు, రాబట్టిన వాయిదాలు మున్నగువానికి సంబంధించిన వివరాల్ని బ్లాక్ అభివృద్ధి అధికారి వ్రాసివుంచాలి.

iii ఈ పథకాన్ని గ్రామీణ గృహవసతి విభాగం అమలు పరస్తుంది. పంచాయతీ సమితులు దానికి సాధ్యమైనంత సహాయం చేస్తాయి

iv ఇళ్ల అభివృద్ధికి అప్పుల్ని కోరే దరఖాస్తుల్ని మొదట పంచాయతీలు చూసి ఆ తరువాత వాటిని బ్లాక్ అభివృద్ధి అధికార్లకి పంపిస్తాయి.

### గ్రామీణ నీటి సరఫరా

16. పంచాయతీ ప్రాంతాలలో నీటి సరఫరా, మురుగు పారుదల పథకాల నిర్వహణ బాధ్యతని ఆయా పంచాయతీలు వహిస్తాయి. సమితులకి మొత్తం మీద వాటి అజమాయిషీ అప్పగించ బడుతుంది.

17. ప్రజలనుంచి విరాళాలు లభిస్తేనే నీటి సరఫరా, మురుగు పారుదల పథకాలు అమలుపరచ బడతాయి. ఆయా పంచాయతీలు వాటిని వసూలు చేయాలి. ఈ విషయంలో సమితులు వాటికి తోడ్పడుతాయి.

### రోడ్లు

18 ఒక గ్రామంనుంచి మరో గ్రామానికి రోడ్లను నిర్మించే బాధ్యతను సమితులు, గ్రామాలలో రోడ్ల నిర్మాణం బాధ్యతని పంచాయతీలు వహిస్తాయి.

### స్థానికాభివృద్ధి పనులు

19. స్థానికాభివృద్ధి పనుల పథకం క్రింద సమితులకి సాధ్యమైన మేరకి విడిగా సొమ్ము కేటాయించ బడవచ్చు.

### కుటీర, చిన్నరకం పరిశ్రమలు

20. స్థానిక పరిస్థితుల కనుగుణమైన పథకాల్ని సమితులతో సంప్రదించి రూపొందించి, వాటిని సమితుల ద్వారా అమలు పరచమని అఖిలభారత సంఘాలు కోరబడతాయి.

21. ఇప్పుడు గ్రామ పరిశ్రమలకి ప్రభుత్వం చేసే ధనసహాయం సమితుల ద్వారా చేయ బడుతుంది.

### చిన్నరకం నీటి పారుదల

22. చిన్నరకం సాగునీటి పనుల నిర్వాహకులుగా సమితులు సాధ్యమైనంత వరకూ పబ్లిక్ వర్క్సు లేక రెవిన్యూ శాఖలచే అంగీకరించ బడతాయి.

### రక్షణ చర్యలు

23. విపత్కాలంలో రక్షణచర్యల్ని సైతం ఈ సమితులు ప్రజల్ని ఆదుకుంటాయి.

### అబ్కారీ

24 ఈ సమితులు అధిక ప్రాంతంలో మద్య నిషేధం అమలులో కృషి చేస్తాయి. తెలంగాణా ప్రాంతంలో మితంగా తాగమని బోధిస్తాయి.

# యుగధర్మం

(పండిట్ జవహర్‌లాల్ నెహ్రూ)

ఒకానొక క్లిష్టపరిస్థితిలో గాంధీజీ యేమనే వారో, యేమిసలహా యిచ్చేవారో తెలియదు. సిద్ధాంతాలెప్పుడూ మారవు. మారేదల్లా జీవితంలో అత్యవసర పరిస్థితులేర్పడినప్పుడు వాటిని అనుసరించే విధానమే. ఆయాకాలాల అవసరాల్నిబట్టి అనుసరణీయమైన సిద్ధాంతా లేర్పడతాయి. ఆ విధానమే నియమమై ఆకాలంలో అమలు జరుగుతుంది. ప్రపంచం మారుతున్నది. దానితోపాటు సంఘం, మానవాళికూడ మారుతున్నాయి. ఈ సత్యాన్ని మనం గుర్తించాలి. రానున్న విషయాలు ఫలానా రూపంలో వుండాలిఅని మనమేదైనా ఒక కఠిన నియమానికి లేక సిద్ధాంతానికి అంటిపెట్టుకుని వుంటే, మనం దేశపురోగమనాని కడ్డువస్తున్నామన్న మాటే. కాలానుగుణమైన నడతను యుగధర్మమంటారు. అంతాకూడా యుగధర్మాన్నను సరించాలి.

ప్రపంచం మారుతుంది. సంఘం పురోగమిస్తుంది. మానవుడుకూడా పరిణామం చెందుతాడు. ఇంతవరకూ యేదేశమూ మార్పులేకుండావుండలేదు. మృతుడొక్కడే చలనరహితంగా వుంటాడు. కాని అతడు సజీవుడై వున్నంతవరకూ పరిణామం పొంది పెరుగుతాడు. అతడు పురోగమించక తప్పదు. అలాగే సంఘమూ పురోగమిస్తుంది. మనం సంఘంతోపాటు ముందుకు సాగాలి. ఈ పరిణామ సిద్ధాంతం సాంఘిక వ్యవస్థలన్నింటికీ వర్తిస్తుంది.

ఉదాహరణకి, ఒక పసిపిల్లవాడినే తీసుకుందాం. వాడికి మంచిమంచి దుస్తులు తొడిగి అలంకరిస్తాం. కొన్నాళ్ళకి వాడు యెదిగేసరికి అవి బిగువైపోతాయి. పిల్లవాడు యెదిగినకొద్దీ అవి పొట్టయిపోతాయి. కాబట్టి సరిపోయే దుస్తులు మళ్ళీ కుట్టించాలి. కుట్టించక ఆ పాత దుస్తులే తొడిగితే చాలక అవస్థ పడతాడు. కొత్తదుస్తులివ్వనంత మాత్రాన పిల్లవాడు యెదగడం మానడు. ఎదిగి యెదిగి ఆఖరికి పాతవాటిని పటాబద్దలు చేసేసి యింకా యెదుగుతాడు. దీనినే సాంఘిక విప్లవమంటారు. దుస్తులు మార్చకపోయినా పిల్లవాడు యెదుగుతాడు లేదా ఆ ప్రయత్నంలో మరణిస్తాడు. అలాగే సంఘంకూడా సిద్ధాంతాల్ని అతిక్రమిస్తుంది. లేదా చలన రహితంగా వుండిపోయి నశిస్తుంది. ఇవీ సాంఘిక విప్లవం రీతులు. సంఘం యెప్పుడూ మారుతూ విప్లవాత్మకమైన మార్పులికి లోనవుతూ వుంటుంది.

## క్రమాభివృద్ధి

మనం చరిత్రనుంచి నేర్చుకున్న దేమిటి? మనకి దాని ప్రాముఖ్య మెటువంటిది? అది మనకేమి చెబుతున్నది? మానవ జీవితం జంతుధర్మంతో యెలాఆరంభమయిందో అదిమనకి బోధిస్తుంది. నిజాని కతడు సృష్ట్యారంభములో పశువే. ఇలా చెప్పడం వల్ల నేను జంతుసంతతిని నిరసించడం లేదు. అనేక విషయాలలో అవి మనకంటెన్నోరెట్లు మెరుగు. మానవుని ప్రారంభ చరిత్ర అతని క్రమాభివృద్ధిని వర్ణిస్తుంది. అతడు బాహ్యారూపంతోపాటు పరిణామం చెందాడు. మానవుని యీ పురోగమనాభివృద్ధుల్ని గురించి చరిత్ర మనకి చెబుతుంది.

కొన్నికోట్ల సంవత్సరాలకి పూర్వం అగ్ని కనుగొనబడ్డంతో మానవచరిత్రలో విప్లవమొచ్చింది. తిరిగే చక్రం—మామూలు చక్రం కనిపెట్టబడ్డాక మరో విప్లవమొచ్చింది. ఆ

యుగంలో దాన్ని కనిపెట్టడమే ఓ గొప్ప. స్థిర నివాసం లేకుండా ఒకచోటినుంచి మరోచోటికి తిరుగుతూ సులభంగా యేదిదొరికితే దాన్ని తినే దశలో మూడవ మార్పు వచ్చింది. అప్పుడు మానవుడికి యేమీ పండించుకోడం చేతగాక ముఖ్యంగా జంతుమాంసం భక్షించేవాడు.

## నూతన సమస్యలు

కొన్నివేల సంవత్సరాల క్రిందటి చరిత్రను సింహావలోకనం చేస్తే, మనకి మానవుని క్రమాభివృద్ధి చరిత్ర తెలుస్తుంది. భూమి దున్నడం తెలిసేక మానవునికి ఆహారం పుష్కలంగా దొరికింది. ఇంక అప్పుడు ఆహారార్థం వేటాడే అవస్థ తప్పిపోయింది. అయితే జనసంఖ్య అభివృద్ధి కావడంతో యెక్కువ ఆహారం అవసరమైంది. జనసంఖ్యతో పాటు ఆహారోత్పత్తి హెచ్చలేదు. ఆరోజులలో జనాభా లెక్కల్ని సేకరించే ఆచారం లేదు. రెండువేల సంవత్సరాల క్రితం భారతదేశం జనసంఖ్య యెంతో యిప్పుడు మనం చెప్పలేం. అయితే అది కోటిగుణితం కాదుగాని కొన్ని లక్షలుండి వుంటుంది. భూమి విస్తారంగా వుండేది. జనసంఖ్య అంత హెచ్చుగా వుండేదికాదు.

ఇప్పుడు మన జనాభా 87 కోట్లకి పెరిగింది. దానికి తగ్గట్టు భూమిమాత్రం హెచ్చలేదు. ప్రతినిత్యం మనని నూతన సమస్యలు యెదుర్కుంటున్నాయి. ప్రతినిత్యం దేశం పరిణామం చెందుతున్నది. పెరిగే జనాభా నరికట్టడానికి మనవద్ద సాధనాలు లేవు. అది పెరిగి తీరుతుంది. సాంఘిక మార్పులు కొత్త సమస్యల్ని లేకెత్తిస్తున్నవి. వాటికి తగిన పరిష్కార మార్గాల్ని కనిపెట్టకపోయినట్లయితే మనం ముందుకు సాగడం అసంభవం. ఇవి కంటికగపడే సత్యాలు. వాటిని మనం ధైర్యంతో యెదుర్కోవాలి.

## కుటీర పరిశ్రమలు

కుటీర పరిశ్రమల్ని గురించి కొంచెం చెబుతాను. ఈ పరిశ్రమలకి చిన్నచిన్న పరికరాలు చాలు. చర్ఖా లేక అంబర్ చర్ఖా అంటే యేమిటి? అవి పరికరాలు. వాటిని యంత్రాలనీ అనొచ్చు. ఆది మానవుడికి రాతి పనిముట్లుండేవన్న విషయం అందరికీ తెలిసినదే. వాటినతడు చెట్లు కొట్టడానికుపయోగించేవాడు. ఈ ఆదికాలపు పరికరాలు క్రమేపీమారి వుత్తమరకం పరికరాలు రూపొందాయి. యంత్రాలు అమలులోకొచ్చాయి. పూర్వకాలపు పులి స్థానాన్ని యిప్పుడు కత్తి ఆక్రమించుకుంది. మనం కత్తి చెడ్డదని అనం. మనమంతా దాన్ని వాడతాం. ఒకవేళ యెవరైనా దానితో మరో మనిషి మెడనరికితే, అతప్పు కత్తిది కాదు. యంత్రం విడిగా ఒక సమస్యకాదు ఏ యంత్రాన్నైనా సంఘప్రయోజనానికి వుపయోగించే విధానం ముఖ్యం. యంత్రాలు చిన్నవైనా పెద్దవైనా అవి మానవుల స్వేచ్ఛను అపహరించి, వారిని అణచివేయుట కంగీకరించకూడదు.

ప్రస్తుతం భారతదేశానికి భారీపరిశ్రమలు, చిన్న చిన్న పరిశ్రమలూకూడా కావాలి. అవి రెండూ ఒకదాని పక్కని మరొకటి వర్థిల్లాలి. ఖాదీ లేక కుటీర పరిశ్రమలు సాధించిన అందమైన వస్తువుల్ని మనం కాపాడాలి. కేవలం పెద్దపెద్ద కర్మాగారాల వల్ల మన అవసరాలు తీరవు.

—లోకమిత్ర





ఎడమ గట్టునుంచి కడం ఆనకట్ట దృశ్యం.

# కడం ప్రాజెక్టు

(శ్రీ హెచ్. ఎన్. అయ్యంగార్, బి. ఇ. నీటి పారుదల డిప్యూటీ చీఫ్ ఇంజనీరు)

కడం నది గోదావరి నది ఉపనదులలో ఒకటి. అది ఆదిలాబాదు జిల్లా బోత్ తాలూకాలో పుడుతుంది. అరగాణిలో సగటు వర్షపాతం 40 అం. అరణ్యాల కొండ ప్రాంతం. నిటారుగా వుంటుంది. అక్కడ దట్టమైన అడవులున్నాయి.

కడం జలాశయం ఆఖరికి గోదావరి ఉత్తర కాలువపై 'బ్యాలన్సింగు' జలాశయంగా పని చేస్తుంది. గోదావరి ప్రధాన ఆనకట్ట నిర్మితమైన తరువాత పూర్తిగా పని చేస్తుంది. కాబట్టి గో.ఉ.కా. పథకం కడంనదీ జలాల వినియోగానికి మాత్రం పరిమితం చేయబడింది. కాబట్టి, మార్పులేమీ అవసరం లేకుండా ఆ తరవాత పూర్తి పథకానికి ఉపయోగపడేలా ఏర్పాటు చేయబడింది. నీటి పారుదల సౌకర్యం అవకాశం కూడా 2,27,000 ఎకరాలనుంచి 67,000 ఎ. తగ్గించ బడింది. ఈ కొత్త పథకానికి రూ 441.00 లక్షలు ఖర్చు కాగలదని అంచనా.

ఈ ఆనకట్ట కడం నదిపై పెద్దూరు గ్రామానికి సమీపంలో బాసర్-మంచిర్యాల రోడ్డులోని 75 వ. మైలులోని రోడ్డు వంతెనకి రెండుమైళ్ల ఎగువన వుంది.

## ఆనకట్ట

ఆనకట్ట పొడుగు 5495 అడుగులు. దానిలో దిగువ భాగాలుంటాయి :

1. కుడివెంపున 'కాంపోజిట్' ఆనకట్ట 4085 అ.
2. ఎడమవెంపున 'కాంపోజిట్' ఆనకట్ట 450 ,,



ఓగీ స్పిల్ వే

| | | |
|---|---|---|
| 3. | మేసనరీ నాన్ ఓవర్ ఫ్లోసెక్షన్ | 340 ,, |
| 4. | మేసనరీ స్పిల్ వే సెక్షన్ | 620 ,, |
| | | 5495 అ. |

## ఓగీ స్పిల్ వే

వరదనీటిని గరిష్ఠం 2 1/2 లక్షల క్యూసెక్కుల్ని పంపగలదని అంచనా. ఈ పని ఓగీకి పైనగల 60 అ × 15 అ తొమ్మిది స్పిల్ వే గేట్ల ద్వారా జరుగుతుంది. నిర్గమన ద్వారాలకి పైన పిట్టగోడల మధ్య 14 అ. వెడల్పుగల రోడ్డుతో ఒక వంతెన వుంది.

## కాంపోజిట్ ఆనకట్ట

నాన్-ఓవర్ ఫ్లో భాగం నుంచి మొదలు పెట్టి కాంపోజిట్ ఆనకట్ట నిర్మించ బడింది. వెనుక వెంపున రోడ్డు సౌకర్యం కల్గించుటకై రోడ్డు మట్టం 700.00 వరకూ మట్టి పోయబడుతుంది.

5 నిర్గమన ద్వారాలు (7 1/2 × 10 అ) గల ప్రధాన తూము యెడమవైపు చివర ప్రధాన ఆనకట్ట కావల 'సాడిల్'లో యేర్పాటు చేయ బడింది.

నీటి వ్యాప్తి విస్తీర్ణం 8.23 చ. మైళ్లు మాత్రమే. దీనివల్ల యెక్కువగా అరణ్య ప్రదేశం, శారభూములు మునిగి పోతాయి.

## గ్రావిటీ ఆనకట్ట

'గ్రావిటీ' ఆనకట్ట ఓగీ స్పిల్ వే కిరువైపులా నిర్మించ బడింది.

## కాలవ

పెద్ద కాలవ ప్రధాన తూమునుంచి బయలు దేరుతుంది. మొదటి అరమైలులోను భూమి పల్లంగా వుంది. ఆ తరువాత దాదాపు కాలవంతా 47 వ. మైలు వరకూ యెగుడు దిగుడు ప్రదేశం గుండాను, దట్టమైన అరణ్య ప్రదేశం గుండాను ప్రవహిస్తుంది.

## వ్యయం

సవరించిన పథకం ఖర్చు రూ 441.00 లక్షలని అంచనా.

| | | |
|---|---|---|
| 1. | ఆనకట్ట, తత్సంబంధమైన పనులు | రూ. 179.36 లక్షలు |
| 2. | 47 మైళ్ల పెద్దకాలవ, పంపిణీ కాలవలు | ,, 261.64 ,, |
| | మొత్తం | రూ. 441.00 ,, |

47 మైళ్ల కాలవ క్రింద మొత్తం 1,25,147 యెకరాల భూమివుంది. దీనిలో 67,000 యె. కి నీటి పారుదల కల్పించాలని సంకల్పం. 65,000 యెకరాలలో వరి ప్రథమ పంట, 2,000 యె. వరి రెండవ పంట పండించ బడతాయి. ఈ నీటి పారుదల వల్ల వచ్చే రాబడి :

| | |
|---|---|
| ప్రథమ పంట వరి ఎ. రూ. 12 చొ॥ | |
| 65,000 యె. కి | రూ. 7,80,000 |
| రెండవ పంట వరి ఎ. రూ. 6 చొ॥ | |
| 2,000 యె. కి | రూ. 12,000 |
| | రూ. 7,92,000 |

ఇందులోనుంచి :

| | |
|---|---|
| 1. 65,000 యె.పై మెట్టమదింపు | రూ. 55,700 |
| 2. నిర్వహణ ఖర్చులు | రూ. 1,67,100 |
| 3. శిస్తువసూలు ఖర్చులు | రూ. 36,9.0 |
| | రూ. 2,59,700 |
| నికరాదాయం | రూ. 5,32,300 |

ఈ ఆదాయం పెట్టుబడి ఖర్చులో 100 కి 1.21 వంతులు.

ఈ ప్రాజెక్టుపని 1949 జూన్‌లో ఆరంభమయింది.

ఇది తొలి పంచవర్ష ప్రణాళికలో చేర్చిన పథకాలలో ఒకటి. 1951-52 కి పూర్వం రూ 59.26 లక్షలు, 1956 మార్చితో ముగిసిన ప్రణాళి కా కాలంలో రూ 296.54 లక్షలు ఖర్చు పెట్టబడినవి. తొలి ప్రణాళిక సమాప్తి నాటికి మొత్తం రూ 355.80 లక్షలు ఖర్చయినవి.

## జరిగిన పని

ఏవో కొన్ని తుది మెరుగులు, స్పిల్ వేపై ఆర్. సి. సి. వంతెనకి సంబంధించిన కొన్ని పనులు తప్ప మిగిలిన ఆనకట్ట పనంతా పూర్తయింది. వరద తలుపుల స్థాపన కూడా పూర్తయింది.

పెద్ద కాలవ పని కూడా పూర్తయింది. పశువులు దాటడానికి దానిపై అక్కడక్కడ కొన్ని



ఫ్లడ్ గేటులకి సంబంధించిన పని



ఫ్లడ్ గేట్ల రివెటింగు

పంపెనలు కావాలని గ్రామీణులు అడిగారు. ఆ పంపెనల యేర్పాటు మాత్రం తరవాయుంది. 65,000 యెకరాలకి నీటినందించే 40 పిల్ల కాలవల్లోను యిప్పటికి 6 పూర్తయాయి. ఇవి యించుమించు 8,433 యెకరాలకి నీటి నందిస్తాయి. 1958 మే నెలాఖరికి మరికొన్ని పిల్ల కాలవలు 12,000 యె.కి నీటి నందిస్తాయి. మిగిలిన 44,567 యె.కి పంట కాలవలు 1959 మే నాటికి త్రవ్వబడతాయి.

## అభివృద్ధి

1957 ఆబీ పంట కాలంనాటికి 4,168 యెకరాలు బాగుచేయ బడినవి. 1958 ఆబీ పంట కాలానికి మరో 12,000 యె.ల్ని బాగుచేయాలని సంకల్పం. 65,000 యెకరాలు పూర్తిగా 1960 ఆబీపంట కాలంనాటికి బాగుచేయ బడతాయి.

ఆనకట్టులోని గ్రామాల్ని పెద్ద రోడ్డుతో కలిపి సరుకు రవాణా సౌకర్యాల్ని కల్పించుటకై రోడ్లపని చేపట్ట బడింది.

## ఇతర సౌకర్యాలు

కాలవ పొడుగునా టెలిఫోన్ మార్గం కూడా నిర్మించ బడింది. ఇది ముఖ్యంగా కాలవ పాడైనప్పుడు అత్యవసరమైన శీఘ్ర వార్తా ప్రసారానికి వుపయోగిస్తుంది.

## వైద్యసహాయం, ప్రజారోగ్యం

ప్రాజెక్టు ఆరంభమైన నాటినుంచి ఆనకట్ట స్థలంలో ఒక ఆస్పత్రి తెరువ బడింది. అదొక పక్కా భవనంలో యేర్పాటు చేయ బడింది. స్త్రీపురుషులు ఆస్పత్రిలోవుండి చికిత్స పొందడానికి వీలుంది. దానిలో ప్రసూతి వార్డు కూడా వుంది. ఆస్పత్రిలో ఒక సహాయ శస్త్ర చికిత్సకుడున్నాడు. కాలవ డివిజన్ ముఖ్య కార్యాలయం గల లింగాపురంలో మరొక డిస్పెన్సరీ తెరవబడింది. వైద్య సహాయానికై ప్రాజెక్టు అంచనాలో ప్రత్యేకం కేటాయించబడిన సొమ్ము ఖర్చుపెట్టబడుతుంది.

ప్రాజెక్టు ప్రారంభమైన నాటినుంచి అన్ని ప్రాజెక్టు శిబిరాలలోను, అక్కడికి సమీపంలో కాలవ పొడుగు నాగల గ్రామాలలోను మలేరియా నివారణ కార్యక్రమం అమలు జరుగుతున్నది. సహాయ శస్త్రచికిత్సకుని హోదాగల మలేరియా నివారణాధికారి యీ కార్యక్రమానికి అధ్వర్యం వహిస్తారు. ఆయన ముఖ్య కార్యాలయం ఆనకట్ట స్థలంవద్ద వుంది.

## నీటి సరఫరా, మురుగు పారుదల

రాతి ఆనకట్టలో 6 అం. వ్యాసంగల గొట్టం అమర్చ బడింది. దానిగుండా నీరు ఒక తొట్టిలోకి



కడెం ఆనకట్ట దృశ్యం (జెడ్ నుంచి)

వస్తుంది. అక్కడినుంచి యెత్తుగావున్న జలాశయంలోకి పంపబడుతుంది. అక్కడినుంచి పెద్ద, చిన్న నీటిగొట్టాలద్వారా శిబిరానికి సరఫరా చేయబడుతుంది. అన్నియిళ్లకి మురుగునీరు భూమి అడుగునుంచి పోయే యేర్పాటు చేయబడింది.

## విద్యుచ్ఛక్తి

రెండు డీసిల్ యంత్రాలద్వారా విద్యుచ్ఛక్తి వుత్పత్తి చేయబడుతున్నది. అది వర్కుషాపు నడుపుటకు, నీటిని తోడుటకు, ప్రభుత్వ భవనాలు, యిళ్లలో విద్యుద్దీపాలకి, వీధి దీపాలకి వుపయోగించబడుతున్నది.

లింగాపురం, ఇంధనవల్లిలలోగల పెద్దకాలవ శిబిరాలు రెండిటిలోనుకూడా చిన్నచిన్న 5 కె. వా. వుత్పత్తి యంత్రాలు రెండు స్థాపింపబడినవి. ఈ ప్రాంతాలు అరణ్య ప్రాంతానికి దగ్గిరిగావున్నాయి. మొన్న మొన్నటివరకూ యిక్కడికి అడివి మృగాలు వస్తూవుండేవి. కాబట్టి యిక్కడ వీధి దీపాలకి విద్యుచ్ఛక్తికై యేర్పాటు చేయబడి ది.

## జల విద్యుచ్ఛక్తి

జలవిద్యుచ్ఛక్తి వుత్పత్తి యంత్రం స్థాపనకై రాతి ఆనకట్టలో అది నిర్మింపబడేటప్పుడు 2 అ. వ్యాసంగల గొట్టం అమర్చబడింది. దీనితో 200 కె.వా. విద్యుచ్ఛక్తిని వుత్పత్తి చేయవచ్చు. ఒక వ్యాపార సంస్థ పూర్తి యంత్రసామగ్రిని రూ 1,50,000 లకే యిస్తానన్నది. అంటే స్థాపించబడిన ప్రతి కె.వా.కి రూ. 750 చొప్పున అవుతుంది ధర చాలా సరసమైనది. ఆనకట్ట, శిబిరమూ కూడా పెద్దగోడ్డుమీద నిర్మల్, మంచిర్యాలలకి సమీపంలో వున్నందున, శిబిరం త్వరలోనే చక్కగా అభివృద్ధి పొంది వినోద యాత్రికుల నాకర్షించ గలదని భావించ బడుతున్నది. విద్యుచ్ఛక్తి లభిస్తే ఆ

చుట్టుపట్ల కొన్ని రంపపు మిల్లులు, బియ్యంమిల్లులు లేస్తాయికూడా. ఆపైన శిబిరం, ఆనకట్ట స్థలం వగైరాలకి విద్యుద్దీపాల నమరిస్తే ఆ ప్రదేశం అందం యినుమడిస్తుంది. జలవిద్యుచ్ఛక్తి పుత్పత్తి యంత్రం స్థాపన పరిశీలనలో వున్నది.

## అభివృద్ధి కార్యక్రమం

ప్రాజెక్టులో ఒక అభివృద్ధి అధికారి వున్నాడు. ఆనకట్ట నిర్మాణంతోబాటు ఆయకట్టు అభివృద్ధి సాధించబడుతున్నది. మాగాణీ పంటలు పండించే రైతులికి తక్కావీ అప్పులివ్వ బడుతున్నాయి. వ్యవసాయ శాఖద్వారా వారికి వుత్తమ విత్తనాలు యెరువులు పంపిణీ చేయబడుతున్నాయి. కడంలో పశుపోషణకై ఒక ప్రత్యేకాధికారున్నాడు. మేలు జాతి పశువుల సాధన, అబోతుల సరఫరాలకి ఆయన బాధ్యత వహిస్తాడు. కడంలో ఒక కోళ్ల పెంపకం కేంద్రంవుంది.

పెద్దకాలవ పడవలు నడవడానికి వీలుగా త్రవ్వ బడినందున, అది చవక రవాణాకుపయోగిస్తుంది. ఇది ఆప్రాంతంలో వ్యాపారాభివృద్ధికి తోడ్పడ్డమే కాక యాత్రికుల్నికూడా ఆకర్షించగలదు

ప్రభుత్వ నిర్ణయానుసారం యాత్రికుల రాక పోకల కనువైన సౌకర్యాల్ని కల్పించాలని సంకల్పించబడింది. ప్రాజెక్టు నిర్మాణం పూర్తయాక అధమం అయిదిళ్లు (సిబ్బందివి) యాత్రికులకై కేటాయించ బడతాయి. అక్కడ కుర్చీలు మున్నగు సామగ్రి, పరిచారకులుకూడా వుంటారు. ఆపైన ఆనకట్ట స్థలంలో అందమైన పార్కులు, తోటలు వుంటాయి. ఈతకి ఒక దొరువుకూడా వుంటుంది. ఈవిధంగా యీ ప్రాజెక్టు ముందుముందు యాత్రిక కేంద్రంగాకూడా అభివృద్ధి చెందుతుంది.

## ముఖ్యాంశాలు

| | | |
|---|---|---|
| 1. ఆనకట్ట వునికి | తూ. దీర్ఘా. | 78°-47' |
| | ఉ అక్షా. | 19°- 7' |
| 2. ఆరగాణి విస్తీర్ణం | | 1,000 చ. మైళ్లు |
| 3. సగటు వర్షపాతం | | 40 అం. |
| 4. ఆధార పడగల సరఫరా | | 18,000 ఎమ్. సి. ఎఫ్. టి |
| 5. పంపగల వరద నీరు గరిష్ఠం (కంప్యూటెడ్) | | 2,50,000 క్యూసెక్కులు |
| 6. నదీ గర్భంలోతు ఆర్. ఎల్. | | 607.60 |
| 7. పునాదిలోతు | ,, | 575.00 |
| 8. ఎఫ్. ఆర్. ఎల్. | | 696 00 |
| 9. గరిష్ఠ నీటి మట్టం | | 699.00 |
| 10. టి. బి. ఎల్. | | 700.00 |
| 11. పిట్టగోడ అగ్రం | | 704.00 |
| 12. ప్రధానతూము సిల్ | | 675.00 |
| 13. మొత్తం శక్తి | | 6,599 ఎమ్. సి. ఎఫ్. టి. |
| 14. సిల్‌కి యెగువ శక్తి | | 8,918 |
| 15. ఎఫ్. ఆర్. ఎల్. వద్ద నీటి వ్యాప్తి విస్తీర్ణం | | 8.28 చ. మైళ్లు |

| | |
|---|---|
| 16. నదీగర్భం నుంచి ఆనకట్ట గరిష్ఠ ఎత్తు | 92.4 అ. |
| 17. స్పిల్ వే పొడుగు | 620 అ. |
| 18. కాంపోజిట్ ఆనకట్ట పొడుగు | 4,585 అ. |
| 19. ఆనకట్ట మొత్తం పొడుగు | 5,495 అ. |
| 20. ముఖద్వారం వద్ద కాలవ ప్రవాహం | 1,100 క్యూసెక్కులు |
| 21. కాలవ (గర్భం) వెడల్పు | 38 అ. |
| 22. కాలవ పూర్తి సరఫరా మట్టంలోతు | 10 అ. |
| 23. కాలవ వాలు | 7,000 లో 1 |
| 24. కాలవ నిడివి | 47 మైళ్లు |
| 25. కాలవక్రింది మొత్తం భూమి | 1,25,147 ఎకరాలు |
| 26. హెడ్ వర్క్సు ఖర్చు | రూ. 179.36 లక్షలు |
| 27. కాలవ ఖర్చు | రూ. 261.64 ,, |





దుగ్గిరాలలో నిర్మించ బడుతున్న ప్రసూతి, శిశు సంక్షేమ కేంద్రం.

ఆంధ్రప్రదేశ్ జిల్లాలు

# గుంటూరు

గుంటూరు జిల్లా వుత్తర అక్షాంశం 15°-18', 16°-50' కి, తూర్పు దీర్ఘాంశం 79°-10', 80°-55' కి మధ్యవుంది. దానికి వుత్తరాన నల్గొండ, కృష్ణా జిల్లాలు, తూర్పున కృష్ణాజిల్లా, బంగాళాఖాతమూ దక్షిణాన నెల్లూరుజిల్లా, పశ్చిమాన నెల్లూరు, కర్నూలు, నల్గొండ జిల్లాలు వున్నాయి. అది యించుమించు విప్పిన గొడుగులా వుంటుంది. కామ దక్షిణంవైపు కున్నట్టుంటుంది. ఈ జిల్లాలో గుంటూరు, తెనాలి, ఒంగోలు, నరసరావుపేటలతో కూడిన 4 రెవిన్యూ డివిజన్లు, 9 తాలుకాలు వున్నాయి. తాలూకాలు : 1. గుంటూరు-దానిలో మంగళగిరి సబ్‌తాలుకా వుంది. 2. సత్తెనపల్లి, 3. తెనాలి, 4. రేపల్లె, 5. పొన్నూరు, చీరాల సబ్ తాలూకాలతో కూడిన బాపట్ల, 6. అద్దంకి సబ్ తాలూకాతో కూడిన ఒంగోలు, 7. నరసారావుపేట, 8. వినుకొండ, 9. మాచెర్ల సబ్ తాలూకాతో కూడిన గురజాల. గుంటూరు పట్నం జిల్లా ముఖ్య పట్టణం.

ఈ జిల్లాని స్థూలంగా మూడు ప్రాంతాలుగా విభజించ వచ్చు. 1. డెల్టా, 2. మెరకరాతి నేలలు, కొండలు, 3. నల్లరేగడ మైదానాలు. తెనాలి, రేపల్లె తాలూకాలు, గుంటూరు తాలూకాలో చాలభాగమూ డెల్టా ప్రదేశాలు. మిగిలిన



శ్రీ ఎమ్. నాగిరెడ్డి
(వడికూడి, పల్నాడు.)



శ్రీ జి. ఎ. వెంకట్రామయ్య
(తెనాలి)



శ్రీ టి. బాలయ్య

# ఈ జిల్లానుంచి ఎన్నికయిన వారు



శ్రీ వావిలాల గోపాలకృష్ణయ్య
(సత్తెనపల్లి)



శ్రీ ఎ. భగవంతరావు
(కూచిన పూడి)



శ్రీ మంతెన వెంకటరాజు



శ్రీ జాగరమూడి చంద్రమౌళి
(అమ్మనబ్రోలు)



శ్రీ టి. జియ్యర్‌దాస్
(ఒంగోలు—రిజర్వుడు)



శ్రీ పుతుంబాక శ్రీరాములు



శ్రీ గోవాడ పరంధామయ్య
(పొన్నూరు)

తాలూకాలు, గుంటూరు తాలూకాలో కొంత భాగమూ మెట్టప్రాంతాలు, నల్లరేగడ మైదానాలు అయి వున్నవి.

గుండ్లకమ్మ, నాగులేరు, చంద్రవంక నదులు యీ జిల్లాలో ముఖ్యనదులు. జీవనదియైన కృష్ణా నది యీ జిల్లా వుత్తర సరిహద్దుల్ని, తూర్పు సరిహద్దులో కొంత భాగాన్ని స్పృశిస్తుంది.

ఈ జిల్లాలో శాసనసభ నియోజకవర్గాలు 25 వున్నాయి. వీటినుంచి 26 మంది యెన్నికవుతారు. లోకసభలో యీ జిల్లాకి ప్రాతినిధ్యం వహించే సభ్యులు నలుగురున్నారు.

## విస్తీర్ణం, జనసంఖ్య

ఈ జిల్లా విస్తీర్ణం 5,751 చ. మైళ్లు. ఇక్కడ 927 గ్రామాలు, 25 పట్టణాలువున్నాయి. జనాభా 25 1/2 లక్షలు. దానిలో గ్రామప్రజలు 20 లక్షలకి మించుతారు. పట్నవాసుల సంఖ్య 5 లక్షలకి కొంచెంపైన వుంటుంది. ఈ జిల్లాలో మొత్తం 7 మునిసిపాలిటీలు, మొదటి తరగతి పంచాయతీలు 51, రెండవతరగతి పంచాయతీలు 688 వున్నాయి. మొత్తం ప్రదేశం 36,93,748 యెకరాల్లోను అడవులు 4,68,862 యె., సాగులాయకుగాని భూమి 4,68,862 యె., సాగుక్రిందనున్న భూమి 21,10,239 యె.

## శీతోష్ణస్థితి, వర్షపాతం

డెల్టా తాలూకాలలోతప్ప మిగిలిన ప్రదేశాలలో వేసవిలో యెండలు యెక్కువ. పల్నాడు తాలూకాలోని రెంటచింతల ఆంధ్రప్రదేశ్‌లో మిక్కిలి వుష్ణప్రదేశంగా పేరుపడింది. తీరప్రదేశాలు గాలివానలకి గురయే అవకాశం వుంది. వినుకొండ, పల్నాడు మెట్టతాలూకాల్లో భూములు కేవలం వర్షాధారమైనవి. అక్కడ అప్పుడప్పుడు అనావృష్టి వల్ల యిబ్బంది కలుగుతుంటుంది. డెల్టాప్రదేశమైన తెనాలి తాలూకా సిరిసంపదలతో తులతూగుతుంది. దానిని యీ జిల్లా ధాన్యాగారమని చెప్పవచ్చు. ఎక్కువ వర్షాలు నైఋతి ఋతుపవనాలవల్ల జూన్ నుంచి సెప్టెంబరువరకూ కురుస్తాయి. [illegible]వి ఈశాన్య ఋతుపవనాలవల్ల అక్టోబరు, నవంబర్లలో కురుస్తాయి. ఈ జిల్లాలో సగటు వర్షాకాలం 47 రోజుల్లోను కురిసే సగటు వర్షపాతం 32.4 అం.

## ప్రజల వృత్తి, పంటలు

వరి ప్రధాన ఆహారపంట. జొన్న, సజ్జ విస్తృతంగా పండించబడగా చోడి (రాగి), కొర్ర, మొక్కజొన్న పరిమితంగా పండించబడతాయి. మిర్చి వేరుసెనగ, పొగాకు ప్రధాన వాణిజ్య పంటలు. పసుపు తెనాలి తాలూకాలో మిక్కిలి ముఖ్యమైన వాణిజ్యపంట. ఒంగోలు. బాపట్ల, రేపల్లె తాలూకాల తీరం పొడుగునా సరివితోటలు, జీడిమామిడితోపులు విస్తారం పెంచబడతాయి. ఈ జిల్లాలో పండిన పొగాకు, పసుపు, మిర్చిలు ఇంగ్లండు, చైనా, అమెరికా, రాష్యాలవంటి విదేశాలలో విక్రయమవుతాయి.

ప్రపంచ ప్రసిద్ధినొందిన ఒంగోలు ఆంబోతులు యీజిల్లా ఒంగోలు ప్రాంతానివే. బ్రెజిల్, కెనడాలవంటి దేశాలు ఒంగోలునుంచి యీ ఆబోతుల్ని కొనుక్కుంటాయి. మిక్కిలి కారం గల మిరపకాయలకి అంతకుమించి గోంగూరకికూడా యీ జిల్లాపేరు పడింది. గోంగూర యీజిల్లా ప్రత్యేకత. ఆకు పచ్చళ్లకి, గోగునార త్రాడు అల్లకానికి వుపయోగిస్తాయి.

గుంటూరు నగరానికి 5 మైళ్ల దూరంలోనున్న లామ్‌లో వ్యవసాయ పరిశోధన కేంద్రం, పశుపోషణ కేంద్రంకూడా వున్నాయి. ఆ కేంద్రాలనుంచి జా. వి. సే; సమాజాభివృద్ధి కేంద్రాలకి, ప్రజలకి కూడా అనేక రకాల వుత్తమ విత్తనాలు, వుత్తమ పశువులు సరఫరా చేయబడతాయి. పశుపోషణ కేంద్రాలలో కృత్రిమ పిండోత్పత్తి కార్యక్రమం మిక్కిలి ముఖ్యమైనది. బాపట్లలో వ్యవసాయ కళాశాల వుంది. అక్కడే జీడిమామిడి పరిశోధన కేంద్రం, గ్రామస్థాయి కార్యకర్తలకు శిక్షణ నిచ్చుటకు వృత్తి విద్యా వ్యవసాయ పాఠశాల కూడా వున్నాయి.

ఈజిల్లా ప్రజల ముఖ్యవృత్తి వ్యవసాయం. వారిలో 100 కి 69 మంది వ్యవసాయంపై ఆధార పడతారు.

## పరిశ్రమలు

ఈజిల్లా ముఖ్యపరిశ్రమ పొగాకుపై ఆధారపడి వుంటుంది. అక్కడ 236 సంస్థలున్నాయి. ఇవి యెక్కువగా గుంటూరు, పర్చూరు, చిలకలూరి పేట చీరాల, త్రోవగుంట, మంగళ గిరులలో వున్నాయి. ఇక్కడ 101 బియ్యం మిల్లులు, 49 నూనెమిల్లులు కూడా వున్నాయి. గుంటూరులో జనపనారమిల్లు, తాడేపల్లి, మాచెర్లల్లో రెండు సిమెంటు ఫ్యాక్టరీలు వున్నాయి. రేపల్లె తాలూకా నగరంలో పంచదార ఫ్యాక్టరీవుంది. గుంటూరు తాలూకా నంబూరులో నూలుమిల్లు వుంది. ఈజిల్లా ముఖ్యంగా బాపట్ల తాలూకా చేనేత పరిశ్రమకు ప్రసిద్ధి. చీరాల-పేరాల పెద్ద వ్యాపార కేంద్రం. స్థానికులు దీన్ని "చిన్న బొంబాయి" అంటారు. జిల్లాలో పెక్కు బీడీ ఫ్యాక్టరీలున్నాయి. చాపల్లకం, త్రాళ్లు పేనడం, నవారునేత, కుండల తయారీ, బుట్టల్లకం మున్నగు నవి యీజిల్లా కుటీర పరిశ్రమలలో కొన్ని. చిన్న రకం పరిశ్రమల విషయంలో కొన్నిటి వివరాలు యివి: తెనాలిలో సోధన్ పెయింట్సు, వేటపా లెంలో అగ్గిపెట్టల తయారీ, వినుకొండలో తోలు పదును పరిశ్రమ, రెమిడి చెర్లలో పలకల పరిశ్రమ, తెనాలి, గుంటూరులలో ఫౌంటెన్ పెన్ పరిశ్రమ.

మాచెర్ల ప్రాంతంలో నాపరాళ్ల పరిశ్రమని, మాచెర్ల చలవరాళ్ల పరిశ్రమనీ యింకా అభివృద్ధి పరచవలసివుంది.

సుప్రసిద్ధమైన కోహినూరు వజ్రం సత్తెనపల్లి తాలూకాలోని కొల్లూరు వజ్రపుగనిలో దొరికిందని ప్రసిద్ధి. ప్రభుత్వ భూగర్భ పరిశోధనశాఖ వజ్రపు గనులకై యీ వజ్రపు ప్రాంతాన్ని పరిశీలిస్తున్నది. మార్కొపోలో కృష్ణానదివెంట ప్రయాణిస్తూ యీ వజ్రపుగని ప్రాంతాన్ని సందర్శించాడని చెబుతారు. ఒంగోలు తాలూకా కొండేడు కొండల్లో యిటీవల ముడియినుం కనుగొన బడింది. త్వరలోనే అది తవ్వబడవచ్చు.

## రహదార్లు

అన్ని తాలూకా ముఖ్య పట్నాలు, అన్ని జిల్లా ముఖ్య పట్నాలు రైలుమార్గాలతో కలుపబడినవి. ఈ జిల్లాలో దక్షిణరైల్వే మార్గాలు బ్రాడ్‌గేజ్‌వి 133 1/4 మైళ్లవి, మీటర్ గేజ్ వి 162 మైళ్లవి వున్నాయి.

ఈ జిల్లాలో మొత్తం 1807 మైళ్ల పొడుగు రోడ్లున్నాయి. వాటిలో 99 మైళ్లు జాతీయ రహదార్లు, 108 మైళ్లు రాష్ట్ర రహదార్లు, 1600 మైళ్లు జిల్లా పెద్దరోడ్లు, యితర గ్రామ రోడ్లూను, కృష్ణానదిపై యిటీవల పూర్తయిన రెగ్యులేటర్-వంతెన, మద్రాసు-కలకత్తా ట్రంకు రోడ్డుమీద గుంటూరు, కృష్ణాజిల్లాల్ని కలుపుతున్నది. ఇది యీజిల్లా రహదార్ల చరిత్రలో ఒక ముఖ్యఘట్టం.

కృష్ణా పశ్చిమ కాలువలు, బకింగ్‌హాం కాలు వలో కలిసే కొమ్మూరు కాలువ మున్నగునవి కూడా రహదార్లుగా వుపయోగించ బడుతున్నవి. వాటిలో నాటుపడవలు సర్వకాల సర్వావస్థల్లోను ప్రయాణీకుల్ని, సరుకునీ తీసుకువెడుతూ వుంటాయి.

## భారీ ప్రాజెక్టులు

మొత్తం 4,98,434 యెకరాలకి నీటిపారుదల సౌకర్యం వుంది. సాగయే నికరం భూమి 21,10,289 యె. లలోను యిది 100 కి 23.6 వంతులు. కృష్ణా బ్యారేజీ పథకంవల్ల గుంటూరు జిల్లాలోని కృష్ణా డెల్టాలో అదనంగా 54,000 యె. ఆయకట్టుకి నీటిపారుదల లభిస్తుంది. నాగార్జున సాగర్ ప్రాజెక్టువల్ల 82 లక్షల యెకరాల భూమికి నీటిపారుదల లభిస్తుంది. ఇందులో యెక్కువభాగం గుంటూరుజిల్లాలో వుంది.

తాలూకా ముఖ్య పట్నాలన్నిటికి విద్యుచ్ఛక్తి సరఫరావుంది. చాల గ్రామాలలో వ్యవసాయ ప్రయోజనానికి విద్యుచ్ఛక్తి లభిస్తుంది,

## విద్య

ఈ జిల్లా విద్యావిషయకంగా బాగా పురోగమించింది. ఇక్కడ మిక్కిలి యెక్కువ విద్యా సంస్థలుండడం యీజిల్లాకి గర్వకారణం. విద్యా కేంద్రంగా వాల్తేరు తరువాత గుంటూరుకే ప్రాముఖ్యమున్నది. బాలబాలికలకి యెన్నో కళాశాలలు, వున్నత పాఠశాలలు వున్నాయి. గుంటూరు జిల్లాలో మొత్తం 4,811 విద్యా సంస్థలున్నాయి, వివరాలు యివి :

| | | |
|---|---|---|
| ఆర్ట్సు, సైన్సు కాలేజీలు | ... | 9 |
| వృత్తివిద్యా కళాశాలలు | ... | 2 |
| ట్రైనింగు స్కూళ్లు | ... | 18 |
| పారిశ్రామిక విద్యా పాఠశాలలు | ... | 6 |
| వాణిజ్య విద్యా పాఠశాలలు | ... | 15 |
| ఆర్ట్సు, వృత్తివిద్యా పాఠశాలలు | ... | 2 |
| సెకండరీ పాఠశాలలు | ... | 145 |
| వృత్తివిద్యా (బేసిక్) పాఠశాలలు | ... | 94 |
| వయోజనవిద్యా పాఠశాలలు | ... | 342 |
| ప్రాథమిక పాఠశాలలు | ... | 4,178 |

## వైద్య సౌకర్యాలు

తాలూకా ముఖ్య పట్నాలన్నిటిలోను ఆస్పత్రులున్నాయి. అవి జాతీయం చేయబడినవి. ఫిర్కా ముఖ్య పట్నాలన్నిటిలోనేకాక ముఖ్యమైన గ్రామాలలోకూడా జిల్లాబోర్డు గ్రామీణ డిస్పెన్సరీలున్నాయి. కొన్ని లక్షల రూపాయలతో అభివృద్ధి చేయబడే జనరల్ ఆస్పత్రి రాష్ట్రంలో మిక్కిలి పెద్దవాటిలో రెండోదిగా వుండగలదు. మంగళగిరిలో క్షయ ఆరోగ్య సదనం నిర్మించబడుతున్నది. అది ఒక గుంటూరు జిల్లాకేకాక పశ్చిమ గోదావరి, కృష్ణా జిల్లాలకికూడా వుపయోగపడుతుంది.

## దర్శనీయమైన స్థలాలు

భట్టిప్రోలు, అమరావతిలలో సుప్రసిద్ధమైన బౌద్ధ స్థూపాలున్నాయి.

పల్నాడు తాలూకా నాగార్జున కొండలో ఇక్ష్వాకు వంశానికి చెందిన శిథిలాలు, బౌద్ధ అవశేషాలు వున్నాయి. ఇది గొప్ప పురాతత్వ ప్రాధాన్యంగల ప్రదేశం. ఆ విషయంలో యిది మొహెంజొదారో, హరప్పలతో తుల తూగుతుంది.

సుప్రసిద్ధమైన ప్రాచీన విశ్వ విద్యాలయాలు కృష్ణానది తీరాన యీ జిల్లాలోని అమరావతి, నాగార్జున కొండలలో వుండేవి. ఇక్కడకి విద్యార్థులేమి, పండితులేమి టిబెట్, చైనా, జపాన్, సింహళం, దేశాలనుంచి, ఇండోనీసియా ద్వీపాలనుంచి అసంఖ్యాకంగా వచ్చేవారు. ఫాహియాన్, హ్యూయన్‌సాంగులు అమరావతి, నాగార్జున కొండలలోని యీ బౌద్ధ విశ్వ విద్యాలయాల్ని దర్శించారని చరిత్ర వల్ల తెలుస్తున్నది. ఈ ప్రాంతంలో దాదాపు 20 శతాబ్దాలకి పూర్వం నుంచి నాగరికత వుండేదని నాగార్జున కొండవద్ద త్రవ్వకాల వల్ల తెలుస్తున్నది. నాగార్జున సాగర్ ఆనకట్ట పూర్తయే సరికి యీ ప్రదేశం మునిగిపోతుంది. కాబట్టి సామాన్యులు, చరిత్ర కారులూ కూడా యీలోపునే దానిని సందర్శించి, దాని నుంచి నేర్చుకోవలసిన దెంతో వుంది.

మంగళగిరి పానకాల స్వామి ఆలయం పాండవుల నాటిదని చెబుతారు. అమరావతిలో కృష్ణానదీతీరానగల అమర లింగేశ్వరుని ఆలయం కుమారస్వామి తారకాసురుణ్ణి చంపిన కాలం నాటిది. ఇంద్రుడు స్వయంగా యిక్కడికి వచ్చి ఈశ్వరుణ్ణి పూజించి నందున యీ ప్రదేశానికి అమరావతి అనే పేరు వచ్చిందని చెబుతారు. అమరావతి, నాగార్జున కొండలలోని స్థల మ్యూజియం, పురాతనవస్తు అవశేషాలు యీ జిల్లా సందర్శించిన వారంతా చూడవలసినవి.

మంగళగిరి నరసింహస్వామి భక్తులు యెంత పానకం సమర్పించినా సరే అందులో సగమే స్వీకరిస్తాడని చెబుతారు.

నరసారావుపేట తాలూకాలోని కోటప్ప కొండ మిక్కిలి ముఖ్యమైన యాత్రాస్థలం. ఈ వుత్సవంలో

జిల్లా అన్ని ప్రాంతాలనుంచీ వచ్చే పత్రికల పూరే గింపు ప్రసిద్ధమైనది. పల్నాడు తాలూకాలోని గుత్తి కొండబిలం ప్రసిద్ధమైన మరొక యాత్రా స్థలం. ఉండవల్లి గుహలు, కొండవీడు శిధిలాలు గూడా ఆకర్షణీయమైనవే.

రాజా వాసిరెడ్డి వెంకటాద్రి నాయుడు చాల దేవాలయాల్ని అభివృద్ధి పరచారు. మంగళగిరి నరసింహస్వామి గారి గోపురాన్ని కూడా అభివృద్ధి పరచారు. అది ఆంధ్రప్రదేశ్ మొత్తంలో మిక్కిలి చిన్న పునాదిపై లేచిన మిక్కిలి యెత్తైన గోపురముట.

పల్నాడు తాలూకా తాళ్లపల్లి సమీపంలో యెత్తిపోతల జలపాతం వుంది. అదిచాలా అందంగా వుంటుంది. అందుచేత, ఆ ప్రదేశాన్ని యాత్రా కేంద్రంగా అభివృద్ధి చేయాలనే ప్రతిపాదన ఒకటుంది.

కొత్త పట్నం, వాడరేవు తీరగ్రామాలు. ఇక్కడ శీతోష్ణస్థితి సాదుగా వుంటుంది. ఆకర్షణీయమైన తీర ప్రదేశమున్నది. వాటిని యించుమించు యీ జిల్లా వేసవి నివాస కేంద్రాలని చెప్పవచ్చు. వేటపాలెంలోని సరస్వతీనికేతనం గ్రంధాలయం రాష్ట్రంలోని వుత్తమ గ్రంధాలయాలలో ఒకటి. ఇక్కడ వివిధ రకాల పుస్తకాలు అసంఖ్యాకంగా వున్నాయి.

ఆంధ్ర కవి సార్వభౌముడైన శ్రీనాధుడు కొండవీటి రాజుల ఆస్థాన కవిగా గుంటూరు జిల్లాలో నివసించేవాడు. సుప్రసిద్ధ వికటకవి తెనాలి రామకృష్ణుని జన్మస్థలం తెనాలిట. సుప్రసిద్ధమైన పల్నాటి యుద్ధాలు వినుకొండ-మాచెర్ల రోడ్డుమీద ప్రస్తుతపు కారెంపూడి కనుమకి సమీపంలో మాచెర్ల-గురజాల భూముల్లో జరిగాయి. ఆంధ్రప్రదేశ్ మిక్కిలి పెద్ద నగరాలు నాల్గింటిలో గుంటూరు ఒకటి.

## అభివృద్ధి కార్యక్రమం

ఇంతవరకూ సమాజాభివృద్ధి కార్యక్రమం క్రిందికి మొత్తం 2,284 చ. మైళ్ల ప్రదేశం తేబడింది. అక్కడి జనాభా 10.17 లక్షలు. అక్కడ యిప్పుడు 14 అభివృద్ధి కేంద్రాలున్నాయి. వాటిలో 1 సమాజాభివృద్ధి కేంద్రం. 11 జా. వి. సే. కేంద్రాలు 2 అనంతర తీవ్ర అభివృద్ధి కేంద్రాలు. ప్రజలు సాధారణంగా అభివృద్ధి కార్యక్రమాల పట్ల వుత్సాహం చూపిస్తారు. ప్రజలు తమ తమ గ్రామాలఅభివృద్ధికై యీ కార్యక్రమాల్లో పాల్గొని జా. వి. సే. కేంద్రాల క్రింద పెద్ద పెద్ద పనుల సాధనలో తోడ్పడ్డారు. గుంటూరులోను, యితర జిల్లాల్లోనూ కూడా మిగిలిన అన్ని పధకాలకంటె స్థానికాభివృద్ధి పధకం యెక్కువ ప్రజాదరాన్ని పొందినట్టు కనబడుతుంది. ఈ పధకం క్రింద ఖర్చయినసొమ్ము, పనుల సంఖ్యలను బట్టి యీ విషయం విదిత మవుతుంది. ఈ పధకం ఆరంభమైనప్పటి నుంచి రూ 18,40,635 ఖర్చుపెట్ట బడినవి. 356 పనులు చేపట్టబడినవి.

వాటిలో :

| | | |
|---|---|---|
| బావులు | ... | 53 |
| వ్యవసాయం పనులు | ... | 1 |
| పారిశుద్ధ్యం పనులు | ... | 11 |
| వంతెనలు | ... | 25 |
| రోడ్లు | ... | 103 |
| పాఠశాలా భవనాలు | ... | 77 |
| డిస్పెన్సరీలు | ... | 21 |
| గ్రంధాలయాలు | ... | 46 |
| మ్యూజియాలు | ... | 1 |
| ఇతర పనులు | ... | 8 |

1947 లో రూ 4,23,000 లు మాత్రమే కేటాయించ బడగా రూ 5,91,500 లు ఖర్చయినవి.

—:O:—

# ప్రశ్నోత్తరావళి

ప్రశ్న:-(శ్రీ ఆర్. ఎస్. ఆర్. దాస్. ఓల్డుబస్తీ, హైదరాబాదు): ఆంధ్రప్రదేశ్‌లో యెన్ని వైద్య కళాశాలలు పని చేస్తున్నాయి?

జవాబు:-ఆంధ్రప్రదేశ్‌లో రాష్ట్ర ప్రభుత్వం నిర్వహించే వైద్య కళాశాలలు 5 వున్నాయి. వాటి వివరాలు, వాటిలో చేర్చుకోబడే విద్యార్థుల సంఖ్యా వివరాలు కూడా దిగువ యివ్వబడినవి:

1. ఆంధ్ర వైద్యకళాశాల, విశాఖపట్నం 125 ప్రవేశాలు
2. గుంటూరు వైద్యకళాశాల, గుంటూరు 105 „
3. కర్నూలు వైద్యకళాశాల, కర్నూలు 50 „
4. ఉస్మానియా వైద్యకళాశాల, హైదరాబాదు 100 „
5. గాంధీ వైద్యకళాశాల, హైదరాబాదు 50 „

ప్రశ్న:-(శ్రీ ఎమ్. నాగభూషణరావు, బి. ఇ., జూనియర్ ఇంజనీర్, హైదరాబాదు) ఆంధ్ర ప్రభుత్వం చేపట్టిన పాఠ్య పుస్తకాల జాతీయకరణ యేదశలో వున్నది?

జవాబు:-5వ. తరగతి తెలుగు వాచకం ఆంధ్ర, శ్రీ వెంకటేశ్వర, వుస్మానియా విశ్వవిద్యాలయాల క్రింద వున్న మూడు ప్రాంతాల నిమిత్తం మూడు విడికూర్పులలో ముద్రించబడింది. ఈ ప్రతులు అధికార యేజన్సీలు, సహకార యేజన్సీలు, సహకార సంఘాల ద్వారా సరఫరా చేయబడుతున్నాయి. మిగిలిన పుస్తకాల విషయంలో పని జరుగుతున్నది.

ప్రశ్న:-(శ్రీ ఎమ్. నాగభూషణరావు, పాలిబండా, హైదరాబాదు) : ఆంధ్రప్రదేశ్‌లో యెన్ని సిమెంటు ఫ్యాక్టరీలున్నాయి?

జవాబు:-ఆంధ్రప్రదేశ్‌లో సిమెంటు ఫ్యాక్టరీలు విజయవాడలో ఒకటి, మంగళగిరిలో ఒకటి వున్నాయి. వివిధ జిల్లాల్లో మరి 7 ఫ్యాక్టరీల ప్రారంభానికై లైసెన్సులివ్వబడినవి. కరీంనగరం జిల్లాలో సిమెంటు తయారీకై లైసెన్సు నిమిత్తం హైదరాబాదు వ్యాపార సంస్థ ఒకటి దరఖాస్తు పెట్టింది.

ఇవిగాక, రెండు ఫ్యాక్టరీలు అస్బెస్టాస్ పలకలు, సిమెంటు ఫిట్టింగు ఆక్సెసరీలు, కాంక్రీటు గొట్టాలవంటి సిమెంటుకి సంబంధించిన వస్తువుల తయారీలో నిమగ్నమై వున్నాయి.

ప్రశ్న:-(శ్రీ విశ్వేశ్వరరావు, సికిందరాబాదు) : ఆంధ్రప్రదేశ్‌లో ప్రస్తుతం కాయగూరల సాగు క్రింద మొత్తం యెంత భూమి వుంది?

జవాబు:-6,59,369 యెకరాలని అంచనా.

ప్రశ్న:-(శ్రీ ఎ. కోటేశ్వరరావు, గుంటూరు) : మన రాష్ట్రంలో యెన్ని బియ్యం మిల్లులున్నాయి?

జవాబు:-ఇంచుమించు 800.

ప్రశ్న:-(శ్రీ జి. లక్ష్మీకాంతం, విశాఖపట్నం) : మన రాష్ట్రంలో గెజిటెడ్, నాన్-గెజిటెడ్ వుద్యోగుల జీతాల కెంత ఖర్చవుతున్నది?

జవాబు:-సాలీనా గెజిటెడ్ వుద్యోగుల జీతాల నిమిత్తం యించుమించు ఒక కోటిరూపాయలు, నాన్-గెజిటెడ్ వుద్యోగుల జీతాల నిమిత్తం రూ 28 కోట్లు ఖర్చవుతున్నాయి.

ప్రశ్న:-(శ్రీ ఎమ్. సూర్యనారాయణ, విజయవాడ) యాత్రీకులు సంవత్సరం పొడుగునా శ్రీశైలం వెళ్లడానికి బస్సు సౌకర్యాలున్నాయా? విజయ

వాడనుంచి వెళ్లే ప్రయాణీకులికి యేతోవ మంచిది ?

జవాబు:-దోర్నాలనుంచి శ్రీశైలానికి 32 మైళ్ల పొడుగున ఘాట్ రోడ్డు నిర్మించబడిన పిమ్మట యాత్రికులు సంవత్సరం పొడుగునా శ్రీశైలం వెళ్లడానికి బస్సుసౌకర్యాలు యేర్పడ్డాయి. ఇందు నిమిత్తం దేవస్థానం వారు బస్సుల్ని నడుపుతున్నారు. ఒక తోవ మార్కాపురం రోడ్డు నుంచి దోర్నాల మీదుగా శ్రీశైలం వెడుతుంది. దీని దూరం యించుమించు 58 మైళ్లు. మరొక తోవ (కర్నూలు-ఆత్మకూరు దోర్నాల-శ్రీశైలం) దూరం యించుమించు 110 మైళ్లు. శ్రీశైలానికి మార్కాపురం రోడ్డునుంచి ఒక బస్సునీ, కర్నూలునుంచి ఒక బస్సునీ శ్రీశైలం దేవస్థానమే నడుపుతున్నది.

విజయవాడనుంచి శ్రీశైలం వెళ్లే యాత్రీకులకి మార్కాపురం దారే చాలా సౌకర్యంగా వుంటుంది. ఎంచేతంటే, ప్రయాణీకులు దేవస్థానం బస్సులో మార్కాపురం రోడ్డు రైలు స్టేషను దగ్గిరే యెక్కవచ్చు. ఆ స్టేషను విజయవాడ-గుంతకల్లు మార్గంలో వుంది.

ప్రశ్న:-(శ్రీ ఎమ్. రామయ్య, కరీంనగరం): భారత దేశం రాష్ట్రాలలో ఒక్కొక్క రాష్ట్రంలోను గల జిల్లాల సంఖ్యని తెలియజేస్తారా? అన్నింటిలోను మిక్కిలి పురోగమించిన రాష్ట్రమేది?

జవాబు:-భారతదేశంలో ఒక్కొక్క రాష్ట్రంలోను గల జిల్లాల వివరాలు యివి:

| | జిల్లాలసంఖ్య |
|---|---|
| 1. ఆంధ్రప్రదేశ్ | 20 |
| 2. అస్సాం | 17 |
| 3. బీహార్ | 18 |
| 4. బొంబాయి | 43 |
| 5. కేరళ | 5 (1957లో) |
| 6. మధ్యప్రదేశ్ | 40 |
| 7. మద్రాసు | 13 |
| 8. మైసూరు | 19 |
| 9. ఒరిస్సా | 14 |
| 10. పంజాబు | 18 |
| 11. రాజస్థాన్ | 26 |
| 12. ఉత్తర ప్రదేశ్ | 51 |
| 13. పశ్చిమ బెంగాలు | 15 |
| 14. జమ్మూ-కాశ్మీర్ | వివరాలు లభించలేదు |

(పై వివరాలకి ఆధారం 1957 ఇండియా సెన్సస్ పేపర్ నెం. 1.)

(బి) బొంబాయి రాష్ట్రంలో పరిశ్రమలు వృద్ధి పొందాయి. ప్రధానమైన నౌకాశ్రయం ద్వారా అక్కడ దేశ విదేశాలతో విస్తృతంగా వ్యాపారం జరుగుతున్నది. కాబట్టి భారతదేశంలో బొంబాయి రాష్ట్రం మిక్కిలి పురోగమించిన రాష్ట్రమని చెప్పవచ్చు.

ప్రశ్న:-(శ్రీ టి. లక్ష్మినారాయణరావు, ఒంగోలు) : కరీంనగరం జిల్లా జనసంఖ్య వివరాలు తెలియచేయగలరా ?

జవాబు:-1951 జనాభా లెక్కల ప్రకారం కరీంనగరం జిల్లా జనాభా తాలూకావారీ వివరాలు యివి :

| | | |
|---|---|---|
| 1. కరీంనగరం | తాలూకా | 3,02,172 |
| 2. సిరిసిల్ల | ,, | 2,28,847 |
| 3 మెట్‌పల్లి | ,, | 1,20,635 |
| 4 జగిత్యాల | ,, | 2,03,865 |
| 5. సుల్తానాబాదు | ,, | 2,43,602 |
| 6 మహాదేవపురం | ,, | 86,846 |
| 7. హుజూరాబాదు | ,, | 2,42,001 |

ప్రశ్న:-ఆంధ్రప్రదేశ్‌లో యెన్ని ఫ్యాక్టరీలున్నాయి ?

జవాబు:-1-1-58 నాటికి, 1948 ఫ్యాక్టరీల చట్టం క్రిందకివచ్చే ఫ్యాక్టరీల సంఖ్య 3,554.

—:0:—

సహకార రంగంలో

# ద్వితీయ ప్రణాళిక లక్ష్యాలు

భారతదేశంలో సహకారోద్యమం గడచిన యేబది సంవత్సరాలుగా వృద్ధి నొందు తున్నది. ఎక్కువగా ప్రభుత్వమే దానిని ప్రారంభించి, అభివృద్ధి పరస్తున్నది. నేడు ఆ వుద్యమం ఒక్క వ్యవసాయ తరగతులకే పరిమితమై లేదు. కాని అది వారి లాభం కోసమే ప్రారంభింప బడింది.

మన చరమ లక్ష్యం సోషలిస్టు పద్ధతి సమాజ నిర్మాణం. ఈ సమాజ నిర్మాణానికి వ్యవసాయ, పారిశ్రామిక రంగాలు రెండింటిలోను కూడా వికేంద్రీకృతమైన యూనిట్లు ఆక్కటిని సృష్టించాలి. కాబట్టి భారత దేశంలో సాంఘిక మార్పుకి ప్రాధాన్యమిచ్చే ఆర్థికాభివృద్ధి సహకారోద్యమ వ్యాప్తికి యెక్కువ అవకాశ మిస్తున్నది. క్రమాను గతమైన అభివృద్ధి పథకంలో సహకార విభాగం నిర్మాణం కూడా జాతీయవిధానం ముఖ్యాశయాలలో ఒకటై వున్నది. వ్యవసాయ పరపతి, వస్తు విక్రియం, ప్రోసెసింగు, గ్రామాలలో వుత్పత్తికి సంబంధించిన అన్ని అంశాలు-యీ రంగాలు సహకారోద్యమం పని చేయుట కనువైనవి. అలాగే వినియోగదారుల సహకార స్టోర్లు, వృత్తి పనివారు, కార్మికుల సహకార సంఘాలు, నిర్మాణ సహకార సంఘాలూ కూడా యేర్పడవచ్చు. ఈ రంగాలలో యెక్కువగా సహకారం ఆర్థిక కార్యక్రమం యేర్పాటుకి ముఖ్య ప్రాతిపదిక కావాలి.

ప్రైవేటు సంస్థలు కాని, ప్రభుత్వ యాజమాన్యం కాని సహకార వ్యవస్థతో సాటిరావు. అది మొత్తం సంఘం పూనికను, వ్యక్తుల పూనికని కూడా సమానంగా వుపయోగించు కోగలదు. అయితే క్లిష్టమైన మానవ సంబంధమైన సమస్యల కారణంగా సహకార సంస్థలు జయప్రదం కావడం కష్టం. కాబట్టి అందు నిమిత్తం సాధ్యమైన చోటెల్లా ముఖ్యంగా జాతీయాభివృద్ధి పథకంలో దానికేర్పాటైన రంగాలలో దాని విజయాని కవసరమైన చర్యల్ని తీసుకోవాలి.

తొలి ప్రణాళిక కాలంలో, ఆంధ్రప్రాంతంలో, సహకార సంఘాల ద్వారా లక్షటన్నుల రసాయన యెరువులు పంపిణీ చేయబడ్డాయి. కర్నూలు, గుంటూరు పట్టణాలలో మధ్యరకం పాడి పరిశ్రమ యంత్రాలు నెలకొల్ప బడ్డాయి. సహకార సంఘాల ద్వారా జరిగే పాల సరఫరా రోజుకి యించుమించు 2,000 మద్రాసు మెషర్లనుంచి 6,000 మ. మె. కి హెచ్చించ బడింది. సహకార సంఘాలపై సమర్థమైన అజమాయిషీ జరుగుటకై డిప్యూటీ రిజిస్ట్రార్ల సర్కిళ్లు కొత్తగా 9 యేర్పాటు చేయబడినవి. సాలీనా యిచ్చే స్వల్పకాలిక, మధ్యకాలిక ఋణాల మొత్తం రూ 3 కోట్ల నుంచి యించుమించు రూ 6 కోట్లకి హెచ్చించబడింది. క్రింది వుద్యోగులకు శిక్షణ నిచ్చుటకై తిరుపతిలో ఒక కేంద్ర సహకార సంస్థ స్థాపించబడింది. తిరుపతి, అనంతపురం, రాజమండ్రిలలో గల మూడు శిక్షణా సంస్థలు అభివృద్ధి పరచబడినవి. ప్రణాళికా కాలంలో మొత్తం 1,570 మంది శిక్షణ పొందారు.

రాష్ట్రంలో సహకారోద్యమం అభివృద్ధికి సంబంధించిన ద్వితీయ ప్రణాళిక సిద్ధాంతాలు యెక్కువగా అఖిలభారత గ్రామీణ పరపతి పరిశీలన సంఘం సిఫార్సుల ననుసరించి వున్నాయి. ఆ సిఫార్సులలో సహకారానికి సంబంధించిన సర్వాంశాలు అనగా గ్రామీణ పరపతి, వస్తువిక్రయం, నిలవ, గిడ్డంగులు, ప్రోసెసింగులు వున్నాయి. పై సంఘం సంకల్పించిన యేకీకృతమైన గ్రామీణ పరపతి పద్ధతికి దిగువ మూలాంశాలు మూడు ప్రాతిపదికలై వున్నవి.

1. ప్రాథమిక పరపతి వ్యవస్థని పెద్దరకం సంఘాలుగా పునర్వ్యవస్థీకృతం చేసి, వాటి కెక్కువ

సభ్యత్వాన్ని, బలమైన వాటా మూలధనాన్ని సమకూర్చాలి. వాటిలో ప్రభుత్వానికి భాగస్వామ్య ముండాలి.

2. సంఘాల వ్యవహార నిర్వహణకి సుశిక్షితులైన సిబ్బందిని సమకూర్చాలి.

3. పరపతి, విక్రయ కార్యక్రమాలకి పటిష్ఠమైన అనుబంధాన్నేర్పరచాలి.

1955 ఏప్రిల్‌లో న్యూఢిల్లీలో జరిగిన రాష్ట్రాల మంత్రుల సమావేశం ఈ సిఫార్సులను అంగీకరించి, ముందు ముందు సహకారోద్యమం యీ పద్ధతిపై అభివృద్ధి చెందాలని నిర్ణయించింది. 15 సంవత్సరాలలో వ్యాపారం, పరపతి, వస్తువిక్రయం, ప్రోసెసింగు మున్నగు కార్యక్రమాలలో సగం భాగం సహకార సంఘాల ద్వారా జరగాలని కూడా ఆ సమావేశం నిర్ణయించింది. రాష్ట్రంలో సహకారోద్యమం అభివృద్ధికై పథకాలు తయారు చేయునపుడు దీర్ఘకాలికమైన యీ ఆశయం దృష్టిలో వుంచుకొన బడుతున్నది.

ద్వితీయ ప్రణాళిక కాలంలో ఆంధ్రలో 9, తెలంగాణాలో 8 మొత్తం 17 పథకాల్ని చేపట్టాలని సంకల్పం. ఆంధ్ర పథకాల అంచనా ఖర్చు రూ 214.22 లక్షలు. తెలంగాణా పథకాల అంచనా ఖర్చు రూ 115.51 లక్షలు. ఈ అన్ని పథకాల అమలుకి రూ 100.18 లక్షల వరకూ కేంద్ర సహాయం లభిస్తుందని భావించ బడుతున్నది. వీటిలో రూ 51.23 లక్షలు గ్రాంట్ల రూపంలోను, రూ 48.95 లక్షలు అప్పుల రూపంలోను లభిస్తాయి.

ఆంధ్రప్రాంతం విషయంలో, ప్రాథమిక స్థాయిలో నిర్ణీతమైన ప్రదేశాలలో 584 పెద్దరకం సంఘాలను యేర్పాటు చేసి తద్వారా సహకార పరపతి వ్యవస్థని పునర్నిర్మించి, పటిష్ఠం చేయాలని ఆంధ్ర ప్రాంతపు ప్రణాళికలో తలపెట్ట బడింది. రూ 175 లక్షల వరకూ అన్ని స్థాయిల్లోను ప్రభుత్వం పెట్టుబడి పెడుతుంది. అపైన ప్రస్తుతపు చిన్నరకం సంఘాలన్నీ కూడా పటిష్ఠం చేయబడి, పునరుజ్జీవింప చేయబడతాయి. ఇందు నిమిత్తం సహకార శాఖ, పెట్టుబడి బ్యాంకులలో అదనపు అజమాయిషీ సిబ్బంది నియమించ బడుతుంది. 1960-61 అఖరు నాటికి 100 కి 90 గ్రామాల్ని, 45 గ్రామీణ కుటుంబాల్ని సహకారోద్యమం క్రిందికి తేవాలని ఆశయం. వ్యవసాయోత్పత్తి, అభివృద్ధిలకై యిచ్చే స్వల్పకాలిక, మధ్యకాలిక, దీర్ఘకాలిక ఋణాల మొత్తాన్ని ప్రణాళికా కాలం అఖరి సంవత్సరంలో రూ 8 (1955-56 లో యివ్వబడిన మొత్తం) కోట్ల నుంచి యించుమించు రూ 20 కోట్లకి లేక రాష్ట్ర వ్యవసాయ పరపతి మొత్తం అంచనాలో 20 శాతానికి హెచ్చించాలని కూడా నిర్ణయించ బడింది. తరువాత 10 సంవత్సరాలలోను క్రమంగా 50 శాతం లక్ష్యాన్ని చేరాలని వుద్దేశం.

అవసరమైనందరు క్రింది వుద్యోగులకి (సహకార శాఖ, సహకార సంస్థలలో నియామకానికై) సహకార సంఘాల సభ్యులు, కార్యకర్తలకి సహకార సూత్రాలు, సంస్థల నిర్వహణ మున్నగు విషయాలలో శిక్షణ యిచ్చే పథకాలు కూడా ప్రణాళికలో చేరివున్నాయి. పరిశోధన, సంఖ్యా వివరాల సేకరణ మున్నగు పనులకై సహకార శాఖలో ప్రత్యేక విభాగాన్నొక దానిని యేర్పరచాలని సంకల్పించ బడింది. అఖిల భారత గ్రామీణ పరపతి పరిశీలన సంఘం సిఫార్సుల ననుసరించి ప్రణాళిక క్రింద సహకార శాఖ అభివృద్ధికై "రాష్ట్ర సహకారశాఖ నిధి"ని, "రాష్ట్ర వ్యవసాయ పరపతి రక్షణ, హామీ నిధి"ని కూడా యేర్పరచాలని సంకల్పం.

తెలంగాణా ప్రాంతం విషయంలో ప్రణాళికలో 191 పెద్దరకం సంఘాల్ని నిర్మించాలని తలపెట్ట బడింది. వాటిలో ప్రభుత్వానికి భాగస్వామ్య ముంటుంది. నిర్వహణకి డబ్బు చెల్లించ బడుతుంది. అపైన 23 ప్రాథమిక భూమి తనఖా బ్యాంకులు, 50 ప్రాథమిక వస్తు విక్రయ సంఘాలు యేర్పరచ బడతాయి. వస్తు విక్రయ సంఘాలు 25 గిడ్డంగుల్ని, పెద్దరకం సంఘాలు 40 గిడ్డంగుల్ని నిర్మిస్తాయి. శాఖ క్రింది వుద్యోగులు, సహకార సంఘాల అనధికార సిబ్బంది, సభ్యులు, కార్యకర్తల శిక్షణకై తగినసౌకర్యాలు కలిగించ బడతాయి. వ్యవసాయోత్పత్తికై యిచ్చే స్వల్పకాలిక, మధ్యకాలిక, దీర్ఘకాలిక ఋణాల మొత్తం హెచ్చించ బడుతుంది.

# అభివృద్ధి కార్యక్రమ కేంద్రాల విశేషాలు

## భద్రగిరి ఏజన్సీ కేంద్రం

శ్రీకాకుళం జిల్లాకలక్టరు భద్రగిరిలో 4-6-58న భద్రగిరి ఏజన్సీ అభివృద్ధి కేంద్రానికి ప్రారంభోత్సవం చేశారు. ఈ వుత్సవ కార్యక్రమం వూరేగింపుతో ఆరంభ మయింది. ఉదయం 8 గం. కి జరిగిన యీ వూరేగింపులో చుట్టుపట్ల కొండగ్రామాల గిరిజనులు, జిల్లా వుద్యోగులు, అభివృద్ధి కేంద్రం వుద్యోగులు, స్థానికోద్యోగులు పాల్గొన్నారు. జి. ఎల్. పురం గిరిజనుడు శ్రీ పెద్దపెంకి నీలకంఠం జాతీయ పతాకాన్నెగురవేశారు. ఆ తరువాత బహిరంగసభ జరిగింది. దానికి శాసన సభ్యుడు శ్రీ వి. చంద్ర చూడామణి అధ్యక్షత వహించారు. ఒరిస్సారాష్ట్ర మాజీమంత్రీ, ప్రస్తుతం కేంద్ర ప్రభుత్వంలో షెడ్యూల్డు జాతుల అసిస్టెంటు కమిషనరూ, విశాఖపట్నం, అయిన శ్రీ సోనారాం సోరెన్ కూడా యీ వుత్సవంలో పాల్గొన్నారు. పార్వతీపురం యేజన్సీ వివిధ గ్రామాలనుంచి వచ్చిన గిరిజనులు యించుమించు 1000 మంది యీ సభకి హాజరయారు.

అధ్యక్షుని తొలిపలుకుల తరువాత జిల్లా కలక్టరు వుపన్యసించారు. ఇతరుల కంటె తాము తక్కువ వారమనే అభిప్రాయాన్ని విడిచిపెట్టి సమాజాభివృద్ధి కార్యక్రమం అమలులో అభివృద్ధి కేంద్రం సిబ్బందికి తోడ్పడమని గిరిజనుల్ని ఆయన వుద్బోధించారు. సమాజాభివృద్ధి కార్యక్రమం ఆశయాలు, బడ్జెటు కేటాయింపుల వివరాలు, అమలు పరచవలసిన వివిధ కార్యక్రమాల్ని గురించి జిల్లా ప్లానింగు అధికారి వివరించారు. జిల్లా కాంగ్రెసు సభ్యుడు శ్రీ కొంతరాములు, శ్రీ బి. సత్యనారాయణ దొరలు కూడా సభలో ప్రసంగించారు.

ఆ తరువాత గిరిజన బాలలకి మిఠాయిలు పంచిపెట్ట బడినవి. జి. ఎల్. పురం ప్రభుత్వ గిరిజన వున్నత ప్రాథమిక పాఠశాలలో, పథక నిర్మాణం, అభివృద్ధిలపై వార్తాచిత్రం ప్రదర్శింప బడింది. మధ్యాహ్నం సవరకోటపాడుగ్రామంలో శ్రమదానం జరుపబడి అక్కడినుంచి కేదారిపురం రోడ్డుకి చిన్నరోడ్డు వేయబడింది.

## వర్ణాంతర వివాహాలు

చేవెళ్ల జా. వి. సే. కేంద్రంలోని కనకమామిడిలో మే నెలలో 12 వర్ణాంతర వివాహాలు జరిగాయి. ఆ ప్రాంతపు సాంఘిక, సాంస్కృతిక జీవితంలో అదొక ముఖ్య ఘట్టమని గ్రామీణులు ఆనందించారు. అభివృద్ధి కేంద్రం సిబ్బంది అవసరమైన సహాయాన్నందించింది. వివాహాలు జరిగిన పిమ్మట యేవిధమైన వివక్షతా లేకుండా అంతా కలిసి ఫలహారాలు సేవించారు.

సాయంకాలం బహిరంగ సభ జరిగింది. జిల్లా ప్లానింగు, అభివృద్ధి కేంద్రం సిబ్బందిలో పెక్కురు ఆ సభలో ప్రసంగించారు. ప్రాసంగికులు అస్పృశ్యత వల్ల కలిగే అనర్థాల్ని నొక్కి వివరించి, దాని నిర్మూలనకై తమ శక్తి కొలదీ పాటుపడాలని ప్రజలకి విజ్ఞప్తి చేశారు. అది నిర్మూలించబడాలని గాంధీజీ యెంతగానో వాంఛించారని చెప్పారు.

గొల్లోరుగుడనుంచి సాహెబాదుకు రోడ్డు నిర్మించ బడుతున్నది. ఆ సందర్భంలో ప్రజలు శ్రమదానంతో ముందుకు వస్తున్నారు.

నవజీవన్‌కి సాన్‌క్లబ్బు గ్రామీణుల సహాయంతో పారిశుద్ధ్యోద్యమాల్ని నడుపుతున్నది. అభివృద్ధి కేంద్రంలో గ్రామస్థాయి కార్యకర్తల ముఖ్య కార్యాలయాలున్న 10 గ్రామాలలోను యీ వుద్యమం క్రమం తప్పకుండా నడుపబడుతున్నది.

కేంద్ర ప్రభుత్వపు పరిశాలికా ప్రచార విభాగం సమాజాభివృద్ధి, పశుపోషణ, వ్యవసాయం, అల్ప విశ్వతో మున్నగు విషయాలపై కనకమామిడి, ప్రొద్దుటూరులలో రెండు వార్తా చిత్ర ప్రదర్శనల్ని యేర్పాటు చేసింది. ప్రొద్దుటూరులో రెండు నాటకాలు కూడా ప్రదర్శింప బడ్డాయి. ప్రణాళికా ప్రచార విభాగం వారు పంపిన బృందం 'మనవూరు' అనే తెలుగు నాటకాన్ని ప్రదర్శించింది. మరొక నాటకాన్ని ప్రొద్దుటూరు నాటక సమాజం ప్రదర్శించింది

## రోడ్డు నిర్మాణం

తిర్మలాయపాలెం సమాజాభివృద్ధి కేంద్రంలోని బారేగూడెంలో మే 18వ. తేదీన శ్రమదానోద్యమం నడుప బడింది. దీనికి ఆ గ్రామంలోని యువకుల క్లబ్బు ఆధ్వర్యం వహించింది. ఈ సందర్భంలో 4 ఫర్లాంగుల రోడ్డు నిర్మించ బడింది గ్రామంలోని స్త్రీలు, పురుషులు పిన్నా పెద్దా, అభివృద్ధి కేంద్రం యావత్తు సిబ్బంది దీనిలో పాల్గొన్నారు. తిర్మలాయ పాలెం గ్రామంలో మరో శ్రమదానం జరుపబడింది. అప్పుడు అప్రోచ్ రోడ్డు ఒకటి మరమ్మతు చేయ బడింది.

కాచిరాజు గూడెంలో 1-5-58 న గ్రంథాలయం ప్రారంభించ బడింది. దానికి సంబంధించిన పని సాంఘిక విద్యా అర్గనైజరికి, గ్రామస్థాయి కార్యకర్తకి అప్పగించ బడింది. సామాజిక రేడియో సెట్టు నిమిత్తం ప్రజలు రూ 275/- యిచ్చారు. వెంకటాయ పాలెం గ్రామస్థుడు శ్రీ సీతారామారావు వెంకటాయ పాలెం గ్రంథాలయానికి రూ 300/- లు విలువ చేసే పుస్తకాల్ని విరాళ మిచ్చారు.

మే నెలలో పాతర్లపాడు, బచ్చోడు గ్రామాలలో బుర్రకథలు యేర్పాటు చేయబడ్డాయి.

## గ్రామ సహాయక శిబిరం

తిర్మలాయ పాలెం సమాజాభివృద్ధి కేంద్రంలోని బచ్చోడు గ్రామంలో మే 23 నుంచి 25 వరకూ గ్రామ సహాయక శిక్షణా శిబిరం యేర్పాటు చేయబడింది. అప్పుడు వ్యవసాయ సంబంధమైన విషయాలలో 57 మంది గ్రామీణులకి శిక్షణ యివ్వబడింది. స్థానిక అభివృద్ధి పనుల సహాయ ఇంజనీరు శ్రీ బాలబ్రహ్మం యీ శిబిరాన్ని ప్రారంభించారు. శ్రీయుతులు వి. నరసయ్య, రంగారెడ్డి గార్లున్నూ, జిల్లా పశువైద్యాధికారి, ఖమ్మమ్మెట, శ్రీ కె. ఎన్. నాయుడు, తిర్మలాయ పాలెం సమాజాభివృద్ధి కేంద్రం సాంఘిక విద్యా అర్గనైజరు శ్రీ జి. లక్ష్మీనాధరావులు శిబిరం ఆశయాల్ని వివరిస్తూ ప్రసంగించారు. శ్రమదానంతో ఒక వీధి రోడ్డు బాగుచేయబడింది. ఇందులో నూరు మంది పాల్గొన్నారు. ఈ శిబిరం విశిష్టత యేమిటంటే యిందులో చాల మంది లంబాడీలు పాల్గొన్నారు. శిక్షణా కాలంలో నేర్పబడిన విషయాల పట్ల వారు చాల పుత్సాహాన్ని చూపించారు.

## మరొక శిబిరం

మంథని జా. వి. సే. కేంద్రంలోని తెడ్చెర్ల గ్రామంలో మే 29 నుంచి 31 వరకూ మూడవ గ్రామ సహాయక శిబిరం (వ్యవసాయ సంబంధమైన విషయాలకి సంబంధించినది) నడుపబడింది. అక్కడ 4 గ్రామాలకు చెందిన 54 మంది గ్రామ సహాయకులకి శిక్షణ యివ్వబడింది. శిక్షితులలో కెల్లావయోవృద్ధుడైన శ్రీ డి. రాజన్న యీ శిబిరాన్ని ప్రారంభించాడు. మంధని సాంఘిక విద్యా అర్గనైజరు తొలిపలుకు చెప్పారు. గ్రామ సహాయక శిబిరాల ఆశయాల్ని వివరించిన పిమ్మట, వ్యవసాయం అభివృద్ధి చెందనిదే ద్వితీయ ప్రణాళికలో తలపెట్టినట్టుగా తలసరి ఆదాయం పెరగదని ఆయన చెప్పారు. ఆ తరువాత శ్రమదానంతో కెంటయెరువు గుంటలు తవ్వబడ్డాయి.

సాయంకాలం వ్యవసాయ విస్తరణాధికారి ఆధునిక వ్యవసాయ పరికరాల్ని గురించి మాట్లాడుతూ సేంద్రియ, రసాయన యెరువుల వాడకం అతిముఖ్యమని నొక్కి చెప్పారు. ఆ తరువాత ఆధునిక వ్యవసాయ పరికరాలు, జపాను పద్ధతి

పెరటిసాగు వంటి వుత్తమ వ్యవసాయ పద్ధతులు ప్రదర్శించబడ్డాయి.

పిల్లల ఆటలు, వినోద ప్రదర్శనలతో ఆ రోజు కార్యక్రమం ముగిసింది.

30 వ తేదీన శ్రమదానంతో శిబిరం చుట్టుపట్ల ప్రదేశం పరిశుభ్రంచేయబడింది. పశు పోషణ విస్తరణాధికారి పశువ్యాధుల్ని గురించి వివరించి వాటికి నివారణోపాయాల్ని సూచించారు. ఆ తరువాత కరీంనగరం మత్స్య సంపద ఇన్‌స్పెక్టరు కరీంనగరంలో మత్స్యసంపద అభివృద్ధిని గురించి మాట్లాడారు. విస్తరణాధికారి పశువుల పాకల్నెలా నిర్మించాలో, పశువులకి విత్తు కొట్టడ మెలాగో చూపించారు. సాయంకాలం స్థానిక విద్యార్థులు ఆటలు యేర్పాటు చేశారు. రాత్రి స్థానిక నాటక సమాజంవారు సత్య హరిశ్చంద్ర నాటకం ప్రదర్శించారు.

మూడవ రోజున వ్యవసాయ విస్తరణాధికారి వచ్చి యెరువు.వుపయోగాన్ని గురించి చెప్పారు. ఆధునిక వ్యవసాయ పద్ధతుల్ని అనుసరిస్తున్న రైతు శ్రీ నారాయణరావు వాటి ఆచరణలో యెదురయ్యే చిక్కుల్ని గురించి చెప్పారు. విస్తరణాధికారి వాటి నధిగమించుటకు తగిన సూచనల్ని చేశారు.

మే నెలలో సీతంపేట (యేజన్సీ) జా. వి. సే. కేంద్రంలోని కడగండిలోను, బూర్జా జా. వి. సే. కేంద్రంలోను కూడా ప్రత్యేక గ్రామ సహాయక శిక్షణా శిబిరాలు జరుప బడ్డాయి.

## ప్రొద్దుటూరులో

చేవెళ్ల జా. వి. సే. కేంద్రంలోని ప్రొద్దుటూరులో వ్యవసాయ సంబంధమైన విషయాలలో ప్రత్యేక గ్రామనాయకుల శిక్షణా శిబిరం యేర్పాటు చేయబడింది.





హైదరాబాదులోని ప్రభుత్వ ప్రసూతి ఆస్పత్రిలో మంత్రసాని విద్య, ప్రసవశాస్త్ర సంస్థను 9-7-58 న శ్రీమతి ఇందిరాగాంధీ ప్రారంభించారు.

# రాష్ట్రంలో వైద్య సౌకర్యాల విస్తరణ

తగినంత ధన వ్యయంతో రాష్ట్రీ సాంఘిక సేవారంగాలు శరవేగంతో అభివృద్ధి పరచబడుతున్నాయి. అట్టిరంగాలలో వైద్యరక్షణ రంగం ఒకటి. ఆధునిక వైద్య సౌకర్యాల్ని క్రమేపీ యెక్కువ గ్రామాలకి అందించడంతోపాటు పట్టణ ఆస్పత్రుల బలాన్ని పెంపొందించుటకు నిరంతరాయంగా కృషి జరుపబడుతున్నది. వైద్య విద్యా సౌకర్యాల విస్తరణకై సాధ్యమైన చర్యలన్నీ గైకొనబడుతున్నాయి.

తెలంగాణా ప్రాంతంలో 18 సమాజాభివృద్ధి కేంద్రాలున్నాయి. వీటిలో రెండు (పుట్నూరు, [illegible] పేట) బహుళార్థ సాధక ప్రాజెక్టులు. సమాజాభివృద్ధి కేంద్రాలన్నిటిలోను కేంద్రానికి ఒకటి చొప్పున ప్రాథమిక ఆరోగ్య కేంద్రాలున్నాయి. మళ్ళీ యీ కేంద్రాలన్నిటికి ఒక్కొక్క దానిక్రింద మూడేసి ఉపకేంద్రాలున్నాయి. ఉపకేంద్రాల పనుల్ని మంత్రసానులు చూస్తారు. ప్రాథమిక ఆరోగ్య కేంద్రాలలో ఒక్కొక్కటి 100 గ్రామాలకి, [illegible] ప్రజలకి ఉపకరిస్తుంది. ఆంధ్రప్రాంతంలో అట్టి సమాజాభివృద్ధి కేంద్రాలు [illegible] ఉన్నాయి.

ఇవికాక 1957-58 లో ప్రతి జిల్లాలోను జాతీయ

విస్తరణ సేవా కేంద్రాలలో 9 ప్రాథమిక ఆరోగ్య కేంద్రాల ప్రారంభాన్ని ప్రభుత్వం మంజూరు చేసింది. అలాగే ఆంధ్రప్రాంతంలో జాతీయ విస్తరణ సేవా కేంద్రాలలో 20 ప్రాథమిక ఆరోగ్య కేంద్రాల ప్రారంభాన్ని కూడా ప్రభుత్వం మంజూరు చేసింది. సమాజాభివృద్ధి మంత్రిత్వ శాఖచే సమాజాభివృద్ధి కేంద్రాలలో నెలకొల్ప బడే ప్రాథమిక ఆరోగ్య కేంద్రాలకి తోడు కేంద్రప్రభుత్వ ఆరోగ్య మంత్రిత్వ శాఖ సహాయంతో జాతీయ విస్తరణ సేవాకేంద్రాలలో మరి 20 ప్రాథమిక ఆరోగ్య కేంద్రాల్ని స్థాపించాలని సంకల్పించ బడింది. ఇందునిమిత్తం ద్వితీయ ప్రణాళికలో కోటి రూపాయలు కేటాయించ బడినవి. ప్రాథమిక ఆరోగ్య కేంద్రాలనుంచి వైద్య, ఆరోగ్య కార్యక్రమాలు మారుమూల గ్రామాలకి కూడా విస్తరించి పని చేస్తాయి. ఒక్కొక్క కేంద్రం 66,000 మందికి సేవచేస్తుంది.

మన ప్రజలలో 100 కి 80 మందికి పైగా గ్రామాలలో నివసిస్తారు. కాబట్టి గ్రామసీమలకి వైద్య సౌకర్యాలు కలిగించడం అత్యవసరం. తాలూకా ముఖ్యపట్నాల ఆస్పత్రులు చాల వాటిలో ముఖ్యంగా తెలంగాణా ప్రాంతంలోని వాటిలో రోగులకి తగినన్ని పడకలు లేవు. వాటిని సమకూర్చడం అత్యవసరం. 1957-58 లో దిగువ తాలూకా ముఖ్యపట్నాల ఆస్పత్రులలో పడకల సంఖ్య హెచ్చించబడింది. వచ్చే సంవత్సరాలలో తెలంగాణా ప్రాంతంలోని తాలూకా ముఖ్య పట్నాల ఆస్పత్రులన్నిటిలోను పడకల సంఖ్యని హెచ్చించాలని సంకల్పం. తెలంగాణా ప్రణాళికలో రూ 9.40 లక్షలు, ఆంధ్ర ప్రణాళికలో రూ 9.91 లక్షలు కేటాయించ బడినవి.



[illegible] కర్నూలు వైద్య కళాశాల [illegible]

### పడకల సంఖ్య హెచ్చించబడిన ఆస్పత్రులు :

| ఆస్పత్రి పేరు | | | పడకల హెచ్చింపు |
|---|---|---|---|
| ఆదిలాబాదు జిల్లా ఖానాపూరు | ప్రభుత్వ | ఆస్పత్రి | 5 నుంచి 15 కి |
| వరంగల్లు జిల్లా మహబూబాబాదు | ,, | ,, | 24 ,, 40 కి |
| నల్గొండ జిల్లా సూర్యాపేట | ,, | ,, | 20 ,, 30 కి |
| నల్గొండ జిల్లా భోనగిరి | ,, | ,, | 18 ,, 26 కి |
| మహబూబునగరం జిల్లా కల్వకుర్తి | ,, | ,, | 5 ,, 20 కి |
| నల్గొండ జిల్లా కొల్లాపురం | ,, | ,, | 4 ,, 15 కి |
| నల్గొండ జిల్లా మిర్యాలగూడ | ,, | ,, | 7 ,, 15 కి |
| వరంగల్లు జిల్లా నరసంపేట | ,, | ,, | 8 ,, 20 కి |

అలాగే నెల్లూరు జిల్లాలోని కందుకూరు, కనిగిరి ప్రభుత్వ ఆస్పత్రుల పడకల సంఖ్య హెచ్చించ బడింది. తెనాలి ప్రభుత్వ ఆస్పత్రి పడకల సంఖ్య 52 నుంచి 80 కి, గురజాల ప్రభుత్వ ఆస్పత్రి పడకల సంఖ్య 4 నుంచి 16 కి, నంద్యాల ప్రభుత్వ ఆస్పత్రి పడకల సంఖ్య 40 నుంచి 50 కి, హెచ్చించ బడింది. ఈ ఆస్పత్రులన్నిటిలోను అదనపు సిబ్బంది నియమించ బడింది. అదనపు పరికరాలు సమకూర్చ బడినవి.

### జాతీయకరణ

స్థానికసంస్థల యాజమాన్యం క్రిందగల స్థానిక నిధి ఆస్పత్రులకి తగినంత డబ్బు లేదు. అందుచేత అవి మిగిలిన ప్రభుత్వ వైద్య సంస్థల స్థాయిలో నిర్వహించ బడలేక పోతున్నాయి. కాబట్టి వాటి అభివృద్ధి దృష్ట్యా, ద్వితీయ పంచవర్ష ప్రణాళిక కాలంలో స్థానిక నిధి ఆస్పత్రులన్నిటని స్వాధీనం చేసుకోవాలని ప్రభుత్వం సంకల్పించింది. అవి యింత వరకూ గ్రామీణులకి వైద్య సదుపాయం కలుగ జేయడంలో అతి ముఖ్యమైన పాత్ర వహిస్తున్నవి. ద్వితీయ ప్రణాళిక మొదటి రెండుసంవత్సరాల లోను జాతీయం చేయబడిన స్థా. నిధి ఆస్పత్రుల వివరాలు యివి :

| | | | |
|---|---|---|---|
| స్థా. | ని. | డిస్పెన్సరీ, | ధర్మవరం |
| ,, | ,, | ,, | పుత్తూరు |
| ,, | ,, | ,, | తాడేపల్లి గూడెం |
| ,, | ,, | ,, | వెంకటగిరి |
| ,, | ,, | ,, | అవనిగెడ్డ |
| ,, | ,, | ,, | కొత్తపేట |
| ,, | ,, | ,, | కపిలేశ్వరపురం |
| దేవస్థానం | | ,, | సింహాచలం |
| స్థా. | ని. | ,, | మాచెర్ల |
| ,, | ,, | ,, | సత్తెనపల్లి |
| ,, | ,, | ,, | సూళ్లూరు పేట |
| ,, | ,, | ,, | ఎమ్మిగనూరు |
| ,, | ,, | ,, | శృంగవరపు కోట |
| ,, | ,, | ,, | నిడదవోలు |
| ,, | ,, | ,, | వినుకొండ |

### సబ్సిడైజుడు డిస్పెన్సరీలు

మారుమూల గ్రామాలలో సబ్సిడైజుడు గ్రామీణ డిస్పెన్సరీలను నెలకొల్పాలని సంకల్పించ బడింది. అక్కడ ఇంగ్లీషు (అలోపతి), ఆయుర్వేద లేకయునానీ వైద్య విధానాలలో యేదైనా వుండవచ్చు. ఇంగ్లీషు లేక దేశీయ వైద్య వేత్తలు డిస్పెన్సరీలు నడపుటకై సాలీనా కొంత ధన సహాయం చేయబడుతుంది. డిస్పెన్సరీలో ఒక మంత్రసాని కూడా వుంటుంది. ఆమెకి కూడా ధన సహాయం చేయబడుతుంది. అసలు వైద్య సౌక

ర్యాలు లేని రెవిన్యూ ఫిర్కాలలో అట్టి నబ్సిడై జుడు డిస్పెన్సరీలు 58 తెరువ బడినవి. తెలంగాణా ప్రాంతంలో కూడా అట్టి గ్రామీణ డిస్పెన్సరీలు తెరువబడ గలవు.

## వైద్యం, వైద్య విద్య

వైద్య కళాశాలల్ని, వాటికి అనుబంధితమై వున్న ఆస్పత్రుల్ని విస్తరించి, యింకా అభివృద్ధి పరచుటకై రమారమి రూ 2 కోట్లు కేటాయించ బడినవి. 1957 జూన్‌లో కర్నూలులో తెరువబడిన సంస్థతో సహా ఆంధ్రప్రదేశ్‌లో మొత్తం 8 వైద్య కళాశాల లున్నాయి. విశాఖపట్నం ఆంధ్ర వైద్య కళాశాలలో యేటా చేర్చుకోబడే విద్యార్థుల సంఖ్య 85నుంచి 110కి, 110నుంచి 125కి హెచ్చించబడింది. అలాగే గుంటూరు వైద్య కళాశాలలో ప్రవేశాల సంఖ్య 50 నుంచి 100 కి హెచ్చించబడింది. కర్నూలు వైద్య కళాశాలలో ప్రవేశాల సంఖ్యను కూడా 50 నుంచి 100 కి హెచ్చించాలని సంకల్పించ బడింది. కింగ్ జార్జి ఆస్పత్రిలో పడకల సంఖ్య 997కి హెచ్చించబడింది. రూ. 40,000 ఖర్చుపై సేవకులకి 30 వసతి గృహాల్ని, రూ. 4.15 లక్షల ఖర్చుతో శారీరక శాస్త్ర (అనాటమీ) బ్లాక్‌ను, రూ. 2.00 లక్షల ఖర్చుపై 'కోల్డు స్టోరేజి' గల 'మార్చురీ'ని నిర్మించుటకు ప్రభుత్వం ఆమోదించింది. కింగ్ జార్జి ఆస్పత్రిలో విద్యార్థి-నర్సులకి అదనపు వసతి సౌకర్యం యేర్పాటుకై చర్య తీసుకోబడు తున్నది. గుంటూరు జనరల్ ఆస్పత్రి గుంటూరు వైద్యకళాశాలల అభివృద్ధికై వరుసగా రూ. 43 లక్షలు, రూ. 33 లక్షల వ్యయంపై రెండు పథకాలు చేపట్టబడ్డాయి. వాటి అమలు పూర్తికా వస్తున్నది. గుంటూరు జనరల్ ఆస్పత్రి పడకల సంఖ్య 200 నుంచి 350 కి హెచ్చించబడింది, కొత్తగా నిర్మితమైన వార్డుల్ని తీసుకోగానే వాటి సంఖ్య 700 కి హెచ్చించబడుతుంది. కర్నూలు జనరల్ ఆస్పత్రికి అదనపు సిబ్బంది, పరికరాలు సమకూర్చబడినవి. రూ. 17 లక్షలు వ్యయం చేసే పథకం అమలు పరచబడింది. పడకల సంఖ్య త్వరలోనే 500 కి హెచ్చించబడుతుంది. కర్నూలులో పూర్వాంధ్ర రాష్ట్రపు సెక్రటేరియట్ భవనాలలో వైద్య కళాశాలను యేర్పాటు చేయాలని 1956 లోనే నిర్ణయించబడింది. ఆ ప్రకారం ఆ కళాశాల గుంటూరులో, గుంటూరు వైద్య కళాశాలలో చేర్చుకునే విద్యార్థుల సంఖ్యని తాత్కాలికంగా హెచ్చించి యేర్పాటు చేయబడింది. 1957 జూలైలో పాఠాలు ప్రారంభమయ్యాయి. రూ. 6 లక్షల ఖరీదు చేసే పరికరాలు సమకూర్చబడినవి.

ఉస్మానియా, గాంధీ వైద్య కళాశాలలు, వాటికి అనుబంధితమైవున్న ఆస్పత్రుల అభివృద్ధికై రమారమి కోటి రూపాయలు కేటాయించబడినవి. స్త్రీల కళాశాల ఆవరణలో రూ. 65 లక్షలతో కొత్తగా వుస్మానియా వైద్య కళాశాలని నిర్మించాలనే ప్రతిపాదన ఒకటి వున్నది. వైద్య కళాశాల శాఖలు భారతీయ వైద్య సంఘం సిఫార్సుల ననుసరించి పునర్నిర్మింపబడినవి. కళాశాలా శాఖలకి, ఆస్పత్రి శాఖలకి రూ. 3 లక్షలు ఖరీదు చేసే అదనపు పరికరాలు సమకూర్చబడినవి. అదనపు సిబ్బంది కూడా నియమించబడింది. రూ. 2.84 లక్షల వ్యయంపై రోగ లక్షణ శాస్త్ర ప్రయోగశాల, మ్యూజియం స్టోర్ లనూ, రూ. 1.96 లక్షలతో కొత్త వంటశాలనూ, రూ. 1.70 లక్షలతో 'మార్చ్యురీ', 'ఆటోప్సీ' లను నిర్మించుటకు ఆమోదించబడింది.

కె. ఇ. ఎమ్. ఆస్పత్రి పడకల సంఖ్య 310 నుంచి 400 కి హెచ్చించబడింది. అదనపు సిబ్బంది, పరికరాలు సమకూర్చబడినవి. దిగువ పనులకై దిగువ మొత్తాలు మంజూరు చేయబడినవి:

| | |
|---|---|
| కె. ఇ. ఎమ్. ఆస్పత్రి, గాంధీవైద్యకళాశాలలకి కొన్ని చేర్పులు, మార్పులు | రూ [illegible] |
| కె. ఇ. ఎమ్. ఆస్పత్రి రెండు భాగాలకి మధ్య గల రోడ్డు సంపాదన | రూ 1.12 లక్షలు |
| గాంధీ వైద్య కళాశాలకి చేర్పులు, మార్పులు | రూ 1.74 ,, |

## శిక్షణా కార్యక్రమం

వివిధ తరగతులలో సుశిక్షితులైన సాంకేతిక సిబ్బంది సంఖ్యను హెచ్చించుటకై వివిధ శిక్షణా

కార్యక్రమాలు ఆరంభింప బడ్డాయి. క్లుప్తంగా వాటి వివరాలు యివి :

1. విశాఖ పట్నం ఆంధ్ర వైద్య కళాశాలలో యేటా 15 మంది సహాయ శస్త్ర చికిత్స కులకి శిక్షణ యివ్వబడు తున్నది.

2. ఆంధ్ర, ఉస్మానియా వైద్య కళాశాలలోను, హైదరాబాదులోని, కేంద్ర లేబొరేటరీలలోను యేటా ఒక్కొక్క సంస్థలో 12 మందికి చొప్పున టెక్నిషియన్లకి శిక్షణ యివ్వబడు తున్నది.

3. వివిధ ఆస్పత్రులలో యేటా 180 మంది కాంపౌండర్లకి శిక్షణ యివ్వబడు తున్నది.

4. శిక్షణా కేంద్రాలలో శిక్షణకై యేటా 158 మంది మంత్రసానులు అదనంగా చేర్చుకో బడు తున్నారు.

5. వివిధశిక్షణా కేంద్రాలలో శిక్షణకై అదనంగా 52 మంది నర్సులకి ప్రవేశ మివ్వబడు తున్నది.

6. వివిధ శిక్షణా కేంద్రాలలో శిక్షణకై యేటా 180 మంది సహాయ నర్సు-మంత్రసానులు చేర్చుకోబడు తున్నారు.

7. నేత్ర వైద్యసంస్థ, సరోజినీదేవి ఆస్పత్రిలో శిక్షణకై యేటా 12 మంది రిఫ్రాక్షనిస్టులు, ఆప్టిషియన్లు చేర్చుకోబడుతున్నారు.

8. ఆంధ్ర వైద్య కళాశాలలో శిక్షణకై యేటా 40 మంది సహాయ ఆరోగ్య కార్యకర్తలు చేర్చుకోబడుతున్నారు.

9. ఆంధ్ర, గుంటూరు వైద్య కళాశాలలో శిక్షణకై శానిటరీ చొప్పునా యేటా 200 మంది శానిటరీ ఇన్స్పెక్టర్లు చేర్చుకోబడుతున్నారు.

10. ఆంధ్ర వైద్య కళాశాలలో లేబొరేటరీ అసిస్టెంట్ల శిక్షణకై యేటా 6 గురు అభ్యర్థులు చేర్చుకోబడు తున్నారు.

11. విశాఖపట్నం కింగ్ జార్జి ఆస్పత్రిలో పబ్లిక్ హెల్తు నర్సుల శిక్షణకై యేటా 12 మంది అభ్యర్థులు చేర్చుకోబడుతున్నారు.

12. ఉస్మానియా జనరల్ ఆస్పత్రిలో వైద్య సాంఘిక సేవకుల శిక్షణకై యేటా 12 మంది అభ్యర్థులు చేర్చుకోబడు తున్నారు.

ద్వితీయ ప్రణాళిక కాలంలోనే కాక తృతీయ ప్రణాళిక కాలంలో కూడా నెలకొల్ప బడే వైద్య సంస్థల నిర్వహణకి చాలినంత సాంకేతిక సిబ్బందిని తయారు చేయాలని ప్రభుత్వం వుద్దేశిస్తున్నది. తృతీయ ప్రణాళిక కాలంలో అవసరం కాగల వివిధ తరగతుల సాంకేతిక సిబ్బంది వివరాల్ని యిప్పుడు తెలుసుకోకపోతే ఆ తరవాత వైద్యసంస్థల అవసరాల్ని తీర్చడం కష్టం. కాబట్టి ద్వితీయప్రణాళిక కాలంలోనే ప్రభుత్వం విస్తృతమైన శిక్షణా కార్యక్రమాల్ని ఆరంభించింది.

## జిల్లా ఆస్పత్రుల అభివృద్ధి

ఏలూరులోజిల్లా ముఖ్యపట్నంఆస్పత్రి నిర్మాణం పూర్తయింది. దానికి రూ 86 లక్షలు వ్యయమయాయి. ఏలూరులోని జిల్లా ఆస్పత్రి పడకల సంఖ్య 120 నుంచి 200 కి హెచ్చించ బడింది. నెల్లూరులోని జిల్లా ఆస్పత్రి పడకల సంఖ్య కూడా 129 నుంచి 150 కి హెచ్చించ బడింది. అనంతపురంలో రూ 19 లక్షలతో కొత్తగా జిల్లా ఆస్పత్రి నిర్మాణం పని చేపట్ట బడింది. కరీంనగరంలోని కొత్త ఆస్పత్రి భవనం 3-1-58 న రాష్ట్ర ముఖ్యమంత్రిచే ప్రారంభింప బడింది. అదనపు వసతి లభించడంతో అక్కడ పడకల సంఖ్య 48 నుంచి 108 కి హెచ్చించ బడింది. అదనపు సిబ్బంది, పరికరాలు సమకూర్చ బడినవి. కరీంనగరంలో 2¼ యెకరాల ప్రైవేటు భూమిని సంపాదించుటకు రూ 1.50 లక్షల్ని, సిబ్బంది నివాస గృహాల నిర్మాణానికై రూ 1.01 లక్షల్ని, మహబూబునగరంలో అదనపు వార్డుల నిర్మాణానికి రూ 6.54 లక్షల్ని, వరంగల్లులో క్షయ విడి పడకల యేర్పాటుకి రూ 25,000 లను, సంగారెడ్డిలోని జిల్లా ఆస్పత్రిలో

క్షయ విడ్డి వార్డు నిర్మాణానికి రూ. 20,540 లను ప్రభుత్వం మంజూరు చేసింది. నిజామాబాదు జిల్లా ఆస్పత్రి విస్తృతం చేయబడింది. ఆదిలాబాదులోని కొత్త ఆస్పత్రి భవనాలు స్వాధీనం చేసుకోబడినవి.

## క్షయ

కాకినాడ, గుంటూరు, కర్నూలు, ఏలూరు, నెల్లూరు, చిత్తూరు, కడప, కరీంనగరం, వరంగల్లు, మహబూబునగరం, నిజామాబాదులలోని జిల్లా ఆస్పత్రులలో క్షయ చికిత్సా వసతులు వున్నాయి. అక్కడ ఎక్స్ రే పరికరాలు కూడా వున్నాయి. దబీర్పురాలో క్షయ ప్రదర్శన, శిక్షణా కేంద్రం ప్రారంభాన్ని ప్రభుత్వం మంజూరు చేసింది. నలుగురు అంతర్జాతీయ సిబ్బందితో ఆ కేంద్రం పని ప్రారంభించింది. రూ. 2.50 లక్షలు ఖరీదు చేసే పరికరాల్ని కేంద్ర ప్రభుత్వం సరఫరా చేస్తున్నది. అదనపు సిబ్బంది నియమించబడింది. ద్వితీయప్రణాళిక తొలి సంవత్సరం లో 150, మలి సంవత్సరంలో 240 క్షయ పడకల్ని ప్రభుత్వం ఏర్పాటు చేసింది.

## కుష్ఠు

కృష్ణాజిల్లా కేసరపల్లి, కర్నూలు, మహబూబు నగరం జిల్లా కొడంగల్లులలో ప్రభుత్వం మొత్తం మూడు కుష్ఠు సర్విడి కేంద్రాల్ని నెలకొల్పింది.

## దంతవైద్యం

కాకినాడ, చిత్తూరు, మచిలీపట్నం, విశాఖ పట్నం కింగ్ జార్జి ఆస్పత్రి, గుంటూరు ప్రభుత్వ జనరల్ ఆస్పత్రిలలోను, నిజామాబాదు, కరీంనగరం, వరంగల్లు, మహబూబునగరాలలోని జిల్లా ఆస్పత్రులలోను దంతవైద్య సౌకర్యాలు ఏర్పాటు చేయబడ్డాయి.

## ముఖ వ్యాధులు

ఆంధ్ర ప్రాంతంలో నెల్లూరు జిల్లా ఆస్పత్రి, కర్నూలు ప్రభుత్వ జనరల్ ఆస్పత్రి, విశాఖపట్నం కింగ్ జార్జి ఆస్పత్రిలోను సుఖవ్యాధులకి చికిత్సా సౌకర్యాలు యేర్పాటు చేయబడ్డాయి. తెలంగాణా ప్రాంతంలో వుస్మానియా జనరల్ ఆస్పత్రిలో లేబొరేటరీతో కూడిన సుఖవ్యాధుల చికిత్సా విభాగం యేర్పాటు చేయబడింది.

## కుటుంబ నియంత్రణ

ఏలూరు, మచిలీపట్నం, చిత్తూరు, అనంతపురాలలోని జిల్లా ఆస్పత్రులలోను, హైదరాబాదులోని నిలోఫర్ ఆస్పత్రిలోను, నిజామాబాదు, ఖమ్మంలలోని జిల్లా ఆస్పత్రులలోను కుటుంబనియంత్రణ విషయంలో సలహాయిచ్చే విభాగా లేర్పరుపబడ్డాయి.

## ప్రత్యేకాహారం

గుంటూరు జనరల్ ఆస్పత్రిలోను, వుస్మానియా జనరల్ ఆస్పత్రిలోను ప్రత్యేకభోజనవంటశాల లేర్పరుప బడ్డాయి.

## పుట్టకురుపు చికిత్స

హైదరాబాదులోని రేడియం యిన్స్టిట్యూటు, కేన్సర్ ఆస్పత్రి అభివృద్ధికై రూ. 8 లక్షల్ని కేటాయించాలని సంకల్పించబడింది. ఈ రకం ఆస్పత్రి ఆంధ్రప్రదేశ్ లో కల్లాయిదొక్కటే అయినందున దానిలో సౌకర్యాల్ని విస్తరింపచేయడం అవసరమవుతున్నది. ఈ సంస్థ పడకల సంఖ్య 40 నుంచి 105 కి హెచ్చించబడింది. అదనపు ఎక్స్ రే పరికరాలు సమకూర్చబడినవి. అదనపు సిబ్బంది మంజూరు చేయబడింది.

## వ్యాధి విరోధం

సమిష్టి మద్రాసు రాష్ట్ర విభజనతో, పూర్వాంధ్ర రాష్ట్రానికి గిండీ కింగ్ ఇన్స్టిట్యూటు వుపయోగం లేకుండా పోయింది. అందువల్ల ఆహారం, మందులు, నీటిని విశ్లేషించి పరీక్షించే సౌకర్యాలు, టీకాల మందుల్ని తయారు చేసుకునే సౌకర్యాలు, సూక్ష్మక్రిమి, జీవరసాయన, రోగ

లక్షణాలకి సంబంధించిన విషయాల్ని పరీక్షించుకునే సౌకర్యాలు లేకుండా పోయాయి. అయితే హైదరాబాదులోని కేంద్ర ప్రయోగశాలల్లో కొంత వరకూ కొన్ని సౌకర్యాలున్నాయి. అందువల్ల వాటిని, నిరోధ చికిత్సా సంస్థగా విస్తృతం చేయడం అవసరమవుతున్నది. ఇందు నిమిత్తం రూ. 20 లక్షలు కేటాయించబడినవి. రూ. 1.78 లక్షలతో అదనపు భవనం నిర్మాణం మంజూరైంది. అదనపు పరికరాలు, సిబ్బందిలను కూడా ప్రభుత్వం మంజూరు చేసింది.

## ప్రసూతి ఆస్పత్రి

హైదరాబాదులోని ప్రభుత్వ ప్రసూతి ఆస్పత్రి బోధనా సంస్థగా పునర్నిర్మించబడింది. రూ. 46,770 ఖర్చుతో ప్రస్తుత భవనాలకి మార్పులు చేయబడినవి. ఔట్-పేషెంటు శాఖ రూ. 22,000 ల ఖర్చుతో మార్చబడింది. ఇవిగాక మరికొన్ని అభివృద్ధి పనులకై రూ. 20,000 ఖర్చు చేయబడినవి.

## క్షయ ఆరోగ్య సదనం

వికారాబాదులోని క్షయ ఆరోగ్య సదనం అభివృద్ధిని ప్రభుత్వం మంజూరు చేసింది. అదనపు సిబ్బంది, పరికరాలు సమకూర్చబడినవి.

## పేడి యాట్రిక్ సెంటరు

కేంద్ర ప్రభుత్వం సహాయంతో నిలోఫర్ ఆస్పత్రిలో పేడియాట్రిక్ సెంటరు నెలకొల్పబడింది. ఈ కేంద్రం అండర్ గ్రాడ్యుయేటు, పోస్టు గ్రాడ్యుయేటు బోధనను చేపడుతుంది. ప్రపంచ ఆరోగ్యసంస్థ యునిసెఫ్ యీ కేంద్రానికి పరికరాలు, శకటాలు, అంతర్జాతీయ సిబ్బందిని యిచ్చి తోడ్పడుతున్నది. రూ. 1.10 లక్షల ఖరీదు చేసే పరికరాలు కొనబడ్డాయి. అదనపు సిబ్బంది నియమించ బడింది. భారతదేశంలో కేంద్ర ప్రభుత్వం సహాయంతో నెలకొల్ప బడ్డ 5 కేంద్రాలలోను యిది ఒకటి.

## సరోజినీదేవి ఆస్పత్రి అభివృద్ధి

ఈ ఆస్పత్రిలో కన్ను, చెవి, ముక్కు, గొంతుక బాధలకు ప్రత్యేకంగా చికిత్స చేయబడుతుంది. అదనపు సిబ్బందితో అదనపు నేత్రచికిత్స యూనిట్టును ప్రభుత్వం యేర్పాటు చేసింది. అడ్మినిస్ట్రేటివ్ బ్లాక్ నిర్మాణానికై ప్రభుత్వం రూ 50,000 మంజూరు చేసింది.





నాగార్జునసాగర్ యెడమకాలవ (భారత్ సేవక్ సమాజ్ అజమాయిషీ క్రింద నిర్మించబడుతున్నది.)

నాగార్జునసాగర్ ప్రాజెక్టు నిర్వహణలో

# భారత్ సేవక్ సమాజ్ పాత్ర

దేశంలోని నదీజలాల్ని భారీయెత్తున వుపయోగించుకోవాలని యెన్నో శతాబ్దాలుగా కంటున్న కలలు నేడు వాస్తవ మవుతున్నవి. బహుళార్థ సాధక నదీ ప్రాజెక్టుల నిర్మాణానికై సాహసంతో కృషి చేయబడుతున్నది. వీటి నిర్మాణం పూర్తయిన నాడు విద్యుచ్ఛక్తి లభించుటే కాక విస్తారమైన మెట్టప్రదేశాలు సస్యశ్యామలం కాగలవు. భక్రానంగల్ ఆసియాలోనే మిక్కిలి పెద్ద బహుళార్థ సాధక ప్రాజెక్టు కాగా మన రాష్ట్రంలోని నాగార్జునసాగర్ ఆనకట్ట ఒక విషయంలో సాటి లేనిది. దీనికి భారతదేశంలో యింతవరకూ నిర్మితమైన యేఆనకట్టకు అవసరం లేనంత సరుకు అవసరం.

ఈ బృహత్ ప్రాజెక్టు నిర్మాణంలో ఒక గొప్ప విశేష మేమిటంటే భారత్ సేవక్ సమాజ్ దాని నిర్మాణంలో పాల్గొంటున్నది. భారత్ సేవక్ సమాజ్ నిర్మాణ కార్యకర్తల సంస్థ. ఈ సంస్థ నల్గొండ జిల్లా మిర్యాలగూడా తాలూకాలో పెద్ద కాలవ మట్టి పనిని నిర్వహిస్తున్నది.

కోసీ ప్రాజెక్టులో భారత్ సేవక్ సమాజ్ సాధించిన విజయాన్ని చూసి అయితేనేమి, ద్వితీయ ప్రణాళికలో చేపట్టబడే జాతీయ ప్రాజెక్టుల నిర్వహణలో తాము కూడా పాల్గొనాలనే బలియమైన వాంఛవల్లనేమి నాగార్జునసాగర్ యెడమ వైపు పెద్దకాలవ తవ్వకంలో తనకు కొంత భాగమిమ్మని (18వ. మైలు, 12వ. మైలులో 1860 అడుగులు) ప్రదేశ్ భారత్ సేవక్ సమాజ్ 1956 లో రాష్ట్ర

ప్రభుత్వాన్ని కోరింది. ఆ ప్రకారం ప్రభుత్వ పబ్లిక్ వర్క్సుశాఖ, భారత్ సేవక్ సమాజ్ కన్వీనరుల మధ్య ఒప్పందం జరిగింది. రూ 11,55,000 అంచనా ఖర్చుపై పని 1956 అక్టోబరులో యివ్వబడింది.

ఇప్పుడు రహదారుల శాఖామంత్రి శ్రీ ఎమ్. నర్సింగరావు 24-10-56 న యీ పనికి ప్రారంభోత్సవం చేశారు. 26-10-56 నుంచి పని ప్రారంభమైనది. ఇటీవల భారత్ సేవక్ సమాజ్ 20 వ. మైలులో పనిని కూడా (2,000 అడుగులు) దగ్గరగా రూ 2,15,000 ఖర్చుపై చేపట్టింది.

మామూలుగా యితర కంట్రాక్టర్లకిచ్చే షరతుల మీదనే భారత్ సేవక్ సమాజ్ కి పని అప్పగించబడింది. అయితే దానికి కొంతడబ్బు (12,13 మైళ్ల పనికి రూ 1,50,000, 20వ. మైలు పనికి రూ 53,000) ముందుగా యివ్వబడుతుంది. పని బిల్లులు సమర్పించబడినప్పుడు వాటినుంచి ముందుగా యిచ్చిన డబ్బులో 100 కి 20 వంతులు తీసుకోబడుతుంది. ప్రాజెక్టువల్ల లాభంపొందే చుట్టుపట్ల గ్రామాలలో అభివృద్ధి పనులపై ఖర్చుపెట్టుటకై భారత్ సేవక్ సమాజ్ బిల్లుల్లో ప్రతి బిల్లునుంచి 100 కి 4 వంతులు మినహాయించుకొనబడుటకు కూడా ఒప్పందం జరిగింది.

ఊటుకూరు, ఇబ్రహీంపేట, నెల్లికాల్ లలో కావుల త్రవ్వకాన్ని వారప్పుడే ప్రారంభించారు. అభివృద్ధి కేంద్రం సిబ్బందితో కలిసి పాఠశాలలు, కావులు నిర్మించడాని కుద్దేశించినపథకాలు మంజూరైనవి. పని త్వరలోనే ప్రారంభింప బడుతుంది.

## స్థానిక కార్మికులు

భారత్ సేవక్ సమాజ్ స్థానిక ప్రజ[illegible]చే పని చేయిస్తున్నది. మామూలు కంట్రాక్టర్లు సాధారణంగా నిపుణతలేని స్థానిక కార్మికుల్ని వుపయోగించరు. దూరప్రాంతాలనుంచి నిపుణులైన కార్మికుల్ని రప్పించి పని జరిపిస్తారు. భారత్ సేవక్ సమాజ్ అలాకాకుండా స్థానికప్రజలకి పనిచూపించి తోడ్పడుతున్నది. ఆ ప్రాజెక్టు తమదేనని, దానివల్ల చివరికి మేలు పొందేదితామే కాబట్టి దాని



భారత్ సేవక్ సమాజ్ నడిపే పాఠశాల

నత్వర నిర్మాణానికై తాము తోడ్పడాలని గ్రామీణులకు తెలియ చెప్పడం సమాజ్ నాయకులకు కష్టమే అవుతున్నది. గ్రామీణులు యీ విషయంలో చేసే సహకారం నిరుత్సాహకరంగా లేదు. నిజానికీ సందర్భంలో భా. సే. సమాజ్ గొప్ప విజయాన్ని సాధించింది. ఎంచేతంటే పోలీసు చర్యకు పూర్వం నల్గొండజిల్లా దౌర్జన్యంగా వ్యవహరించింది. ప్రభుత్వం కాని ప్రభుత్వేతర సంస్థ కాని యే పని తలపెట్టినా చాల కాలం నల్గొండజిల్లా ప్రజలు సహకరించేవారు కారు. కష్టమైన ప్రదేశాలలో పనికి నిపుణ కార్మికులు నియోగించబడుతున్నారు. ఇప్పుడు వారు మొత్తం కార్మికులలో నాలుగో వంతున్నారు. స్థానిక కార్మికులకు సగటున రోజుకి రెండు రూపాయలు దొరుకుతున్నాయి.

భారత్ సేవక్ సమాజ్ ముఖ్య కార్యాలయం ఇబ్రహింపేటలో వుంది. ఎందుకల్లనంటే అక్కడి నుంచి పని జరిపించడం సులభం.

## సాంకేతిక సిబ్బంది

1957 జూలైలో పబ్లిక్ వర్క్సు శాఖ యిచ్చిన పట్టభద్రుడైన ఇంజనీరు అక్కడ పనిచేస్తున్నారు. ఆయన కింద యిద్దరు కార్యనిర్వాహక సహాయకులు, కొందరు మేస్త్రీలు వున్నారు. అక్కడే నివసించే ఒక అధికారి శిబిరం సాధారణ వ్యవహారాల్ని చూసి, కార్మికుల్ని నియమిస్తారు. ఆయన క్రింద ఒక సాంఘిక సేవిక, ఒక వుపాధ్యాయుడు పని చేస్తారు. వీరు కాక జమా ఖర్చుల్ని వ్రాయడానికి ఒక అక్కౌంట్సు ఆఫీసరు వున్నారు.

## సౌకర్యాలు

సిబ్బందికి గృహవసతి తాత్కాలిక ప్రాతిపదికపై కల్పించబడింది. ఒక స్టోర్సు షెడ్డుకూడా నిర్మించబడింది. కార్మికులకి గుడిసెలు నిర్మించబడ్డాయి.

భా. సే. సమాజ్ 18.11.56 నుంచి ఒక పాఠశాలను ప్రారంభించి నడుపుతున్నది. అక్కడికి సగటున 80 మంది పిల్లలువస్తున్నారు. వయోజనుల నిమిత్తం రాత్రి పాఠశాల నడపబడుతున్నది. కార్మికుల వినోద కాలక్షేపానికై బుర్రకథ బృందం ఒకటి వుంది. 30.11.56 నుంచి భా. సే. సమాజ్ శిబిరం వద్ద ప్రయోగాత్మకంగా పోస్టాఫీసు నడపబడుతున్నది.

వీధుల్లో కిరసనాయిలు దీపాలున్నాయి. పని చేసే చోట, గుడిసెలవద్ద కూడా రక్షిత నీటిసరఫరా జరుగుతున్నది. ప్రథమ చికిత్సకి, చిన్న చిన్న బాధలకి, చిన్న చిన్న ప్రమాదాలకి చికిత్సచేయుటకొక డిస్పెన్సరీవున్నది. పెద్ద పెద్ద ప్రమాదాలు, బాధల సందర్భంలో బాధితుల అవసరాన్ని బట్టి హైదరాబాదు, మిర్యాలగూడా లేక నల్గొండలకి తీసుకువెళ్ళబడతారు.

ఈ శిబిరంలో ముఖ్యమైన జాతీయ పర్వాలన్నీ జరుపబడుతాయి. నైపుణ్యానికి కార్మికులకి బహుమతు లివ్వబడతాయి.

ఇక్కడ నాలుగు స్క్రేపర్లు, ఒక బుల్‌డోజరు, ఒక గ్రేడరు పని చేస్తున్నాయి. పెద్ద పెద్ద గట్లు పోయవలసి వచ్చినప్పుడు వీటితో పని జరిపిస్తే చవక. కార్మికులకి తట్టలు మున్నగు పరికరాలు చేతధరకి సరఫరా చేయబడుతున్నవి. ఆ డబ్బు వారి నుంచి వాయిదాలలో రాబట్టబడుతుంది.

ఈ లోటు ప్రాంతంలో నిరుద్యోగులుగా వున్న యెందరో కార్మికులకి పని కల్పించి భారత్ సేవక్ సమాజ్ వారి జీవితాలను ఆనందవికసితం చేసింది. నాగార్జునసాగర్ ప్రసిద్ధికెక్కి, దాని దర్శనార్థం దేశంనలుమూలల నుంచి వచ్చే ప్రేక్షక ప్రవాహం వెల్లివిరిస్తే, అప్పుడు రాజకీయేతర సంస్థయయిన భారత్ సేవక్ సమాజ్ కృషి సువర్ణ కాంతులీనుచూ దేశ ఆర్థిక పునర్నిర్మాణంలో ప్రజా సహకారం యేమి సాధించగలదో చాటగలదు.

—o-:-o—



రాష్ట్ర ధర్మాదాయ, కార్మిక శాఖామంత్రి శ్రీ ఏ. భగవంతరావు.

# ఖాదీ గ్రామోద్యోగ మహా విద్యాలయంలో

హైదరాబాదులోని ఖాదీగ్రామోద్యోగ మహా విద్యాలయంలో రెండవ జట్టు శిక్షణకి ఆంధ్రప్రదేశ్ ధర్మాదాయ, పరిశ్రమల శాఖామంత్రి శ్రీ ఏ భగవంతరావు ప్రారంభోత్సవం చేశారు. ఇందులో ఆంధ్రప్రదేశ్, బొంబాయి, మధ్యప్రదేశ్ ప్రభుత్వాలు పంపిన 77 మంది విస్తరణ అధికార్లు వున్నారు. మంత్రిగారు తమ ప్రారంభోపన్యాసంలో శిక్షణ ఆశయాల్ని సవిస్తరంగా వివరించారు. గ్రామీణ ఆర్థిక వ్యవస్థని అభివృద్ధి పరచి, గ్రామ ప్రాంతాలలో మిక్కిలి తీవ్రముగా నున్న నిరుద్యోగాన్ని పారద్రోలాలని అందుకు గ్రామ పరిశ్రమలను అభివృద్ధి పరచడం అవసరమనీ, అందుకు నిజమైన సామర్థ్యంగల విస్తరణాధికార్లు అవసరమనీ అందుకే యీ మహావిద్యాలయంలో వారికి శిక్షణ యివ్వబడుతున్నదనీ ఆయన అన్నారు. ఆ సందర్భంలో డిప్యూటీ అభివృద్ధి కమిషనరు శ్రీ పి. వి. రత్నం, ఐ. ఏ. ఎస్. కూడా అక్కడికి వెళ్లారు.

ప్రిన్సిపాల్ శ్రీ పి. పోలిరెడ్డి వందన సమర్పణ చేశారు.





'విస్కౌంటు" విమానం

# విస్కౌంటు విమాన సర్వీసు

ఢిల్లీ-హైదరాబాదు - మద్రాసు విస్కౌంటు సర్వీసు 1958 జూన్ 15వ. తేదీనుంచి ప్రారంభించ బడింది. మునుపటి డకోటా సర్వీసు స్థానే పనిచేసే యీ విస్కౌంటు సర్వీసులో ఢిల్లీ, మద్రాసుల మధ్య తిరిగే విమానాలు హైదరాబాదు మీదుగా ప్రయాణిస్తాయి. అవి భోపాల్‌లో కాని లేక నాగపూర్‌లో కాని ఆగవు. ఢిల్లీ, మద్రాసుల మధ్య ప్రారంభమైన యీ కొత్త సర్వీసులో విమానం యెగిరే కాలం 6 గంటల 30 నిమిషాలకి తగ్గింది అంటే ప్రయాణకాలంలో 2గం. 20 నిమిషాలు తగ్గినవన్న మాట. డకోటాలో హైదరాబాదు నుంచి ఢిల్లీ వెళ్లుటకు 5 గంటలు పట్టేది. ఇప్పుడు బయలుదేరిన 3 గంటలలోపున వెళ్లవచ్చు. విస్కౌంటులో ఎయిర్ కండిషన్డు సౌకర్యాలున్నాయి. ప్రయాణికులు వూగకుండా సుఖంగా ప్రయాణం చేయవచ్చు కూడా.

భారతీయ విమానయాన సంస్థచే ప్రవేశ పెట్టబడిన యీ విస్కౌంటు భారతదేశ విమానయాన చరిత్రలో ఒక ముఖ్యఘట్టం.

విస్కౌంటు శక్తివంతమై సుఖప్రదమైనవిమానం. డకోటా ఖరీదు రూ 5 లక్షలు మాత్రమే కాగా దీని ఖరీదు రూ 75లక్షలు. దానికి నాలుగు యింజన్లు వుంటాయి. అయితే రెండు యింజన్లతో కూడా దానిని నడపవచ్చు. అది 1780 బ్రిటిష్ హార్సు పవర్ శక్తిని వుత్పత్తిచేసి గంటకి 325 మైళ్ల వేగంతో భూమినుంచి 4 మైళ్ల యెత్తున యెగురగలదు. అది బలమైన వడగళ్ల వానని సైతం నిగ్రహించగలదు. కాబట్టి యిప్పుడు విమానయానానికి పూర్వంకంటె యెక్కువ భద్రత సమకూరింది.

—o:o—

# సుఖీభవ......

రాష్ట్రపతి డా. రాజేంద్రప్రసాద్ హైదరాబాదులో రమారమి నాలుగు వారాలు వుండి, ఆ తరువాత అక్కడినుంచి 17-7-58 న బయలు దేరుతూ రాష్ట్రప్రజలకి దిగువ సందేశాన్ని యిచ్చారు.

"హైదరాబాదులో రమారమి నాలుగువారాలు వున్న పిదప అక్కడినుంచి బయలు దేరబోయే సమయంలో ఆంధ్రప్రదేశ్ ప్రజానీకానికి నా అభినందలను, శుభాకాంక్షలను అందజేస్తున్నాను. నేను యిక్కడ వున్నంత కాలం సాధ్యమైన అన్ని సందర్భాలలోను, వారు నాపట్ల అపారమైన ప్రేమ సుహృద్భావాలను చూపారు. క్రొత్తగా యేర్పడి యేకీకృతమైన యీ రాష్ట్ర అభివృద్ధి, పురోగమనానికి వలసినంత అవకాశ మున్నదని తెలుసుకొనుటకు నాకెంతో సంతృప్తి కరంగా వుంది. వాటిని సద్వినియోగం చేసుకుని ఆంధ్రప్రదేశ్ రాష్ట్రం దినదినాభివృద్ధిని చెందుతుందని నా విశ్వాసం. ప్రజలూ, ప్రభుత్వమూ కార్య సిద్ధిని పొంది ఆనంద విలసితులు కావాలని కాంక్షిస్తున్నాను"

జూలై 16వ. తేదీన రాష్ట్రపతి హైదరాబాదులో ఆంధ్రప్రదేశ్ సర్వోదయ పాత్ర, సర్వోదయ మండలి, గాంధీ సాహిత్య ప్రకాశన్ అనే మూడు సర్వోదయ సంస్థలకి ప్రారంభోత్సవం చేశారు. ఆంధ్రప్రదేశ్‌లో ఆరంభమైన సర్వోదయ కృషిని గురించి తెలుసుకొనుటకు తమకు ఆనందంగా వున్నదని, యీ రంగంలో ప్రజలు చిత్తశుద్ధితో పని చేస్తున్నారని తాము విశ్వసిస్తున్నామనీ యీ సందర్భంలో ఆయన అన్నారు.

గాంధీ సాహిత్య ప్రకాశన్ గాంధేయ వాఙ్మయ ప్రచురణకి పూనుకొనుటను గురించి ప్రస్తావిస్తూ గాంధీజీకి ఆంధ్రదేశంపట్ల, దాని ప్రజానీకం పట్ల గొప్ప విశ్వాసం వుండేదన్నారు. ఆయన యింకా యిలాఅన్నారు. గాంధీజీ తొలుదొల్త సత్యాగ్రహం ప్రారంభించినప్పుడు ఆయన పూర్తిగా ఆంధ్రప్రజానీకంపై ఆధారపడ్డారు. కాబట్టి గాంధేయ సిద్ధాంతాలను, వాఙ్మయాన్ని ప్రచారంలోనికి దెచ్చుట ఆంధ్రులకి క్రొత్త విషయమేమీ కాదు. ప్రచురణ సంఘం ప్రస్తుత ప్రయత్నంవల్ల ప్రాంతీయభాషయైన తెలుగులో గాంధేయవాఙ్మయానికి యెక్కువ ప్రాచుర్యం లభిస్తుంది. లాభంతీసుకోకుండా పుస్తకాలను అమ్ముటకు సంఘం చేసుకున్న నిర్ణయంకూడా ప్రశంసనీయమైనది. భారతదేశం పేదదేశం కాబట్టి భారత ప్రజానీకం నామమాత్రపు ధరకు లభించే అట్టి పుస్తకాలను కొనగలుగుతుంది.

ఎక్కువ శక్తిగల క్రొత్త ట్రాన్స్‌మిటర్ వల్ల ఆంధ్రప్రదేశ్ ప్రజానీకానికి వార్తా ప్రసార సౌకర్యాలు హెచ్చగలవనీ, యిది హర్ష దాయకమైన విషయమనీ జూలై 16వ. తేదీన ఆలిండియా రేడియో హైదరాబాదు కేంద్రంలో 10 కె. వా. షార్టువేవ్ ట్రాన్స్‌మిటరు ప్రారంభోత్సవ సమయంలో ఆయన అన్నారు. అయితే హైదరాబాదు కేంద్రంనుంచి ప్రసారమయే విషయాలు ఆంధ్రప్రదేశ్ సరిహద్దుల కావలగల ప్రజలను కూడా ఆకర్షించ వచ్చుననీ, కాబట్టి బహుశా యీ వార్తా ప్రసార సౌకర్యాలు ఒక్క ఆంధ్రులకే పరిమితమైనవి కాకపోవచ్చునని కూడా ఆయన అన్నారు. సుసంపన్న సాంప్రదాయ విలసితము అయిన ఆంధ్రుల కళా సంస్కృతులు, వారిబుద్ధి వైదగ్ధ్యము రాష్ట్రేతరులను కూడా తప్పక ఆకర్షించ గల



గుంటూరుజిల్లా తోటవారిపాలెం పంపింగుస్కీముకి రాష్ట్ర ముఖ్యమంత్రి శ్రీ ఎన్. సంజీవరెడ్డి 14-6-59 న శంకు స్థాపన చేశారు.

వన్నారు. కాబట్టి హైదరాబాదులో క్రొత్త ట్రాన్స్‌మిటర్ స్థాపన అందరికీ హర్షదాయకం కాగలదని తాను భావిస్తున్నానన్నారు.

జూలై 16వ. తేదీన ఆంధ్రప్రదేశ్ హైకోర్టు నూతన భవనాలకు ప్రారంభోత్సవం చేస్తూ సత్కృషికి చక్కని వసతి సౌకర్యం అవసరమని ఆయన అన్నారు. న్యాయమూర్తుల పని బాధ్యతా యుతమైనదని, వారు తమ కర్తవ్యాన్ని అందరికీ సంతృప్తికరంగా నిర్వహించాలంటే, వసతి సౌకర్యం, పరిసరాలు బాగుగావుండాలని ఆయన అన్నారు. ఇప్పుడు ఆంధ్రప్రదేశ్ హైకోర్టుకి వలసినందరు న్యాయమూర్తులు వున్నందున వాయిదా పడిన కేసులన్నీ పరిష్కారం కాగలవనీ, క్రమేణా న్యాయ విచారణ సత్వరం ముగిసి తద్వారా ప్రజల ఖర్చుభారం తగ్గగలదనీ ఆశిస్తున్నారు.

# భారతమాత

(శ్రీ. టి. వి. కృష్ణారావు)

ఆకాశలోకాన కైలాస శిఖరాన
ఆమోద మెగజల్లు మంచు మల్లెల ముదువు
మానస సరస్తీర తరుకుంజములలోన
మందాకిని యొసంగు అందాలకు ముసుంగు
గంగ గౌతమి తుంగ యమున కృష్ణానదుల
బంగారు జలపాత శృంగార మాలికల
వేద విదులను కదనయోధుల
కొల్లగను కన్నట్టి తల్లి
గాంధిమహాత్ముని గౌతమ బుద్ధుని
నీతిగ పెంచిన పూత చరిత్రి
ఖనిజ వాణిజ్యాల ఖండాంతరఖ్యాతి
నిండారగా గన్న పండు ముత్తైదువ
పావన చరిత్రా ఓ భరతమాతా
జోహారు ఓ భువన విదితా.

# "ఆంధ్రప్రదేశ్" ప్రకటన రేట్లు



'ఆంధ్రప్రదేశ్' పత్రికలో ఈ దిగువ రేట్లప్రకారం ప్రకటనలు స్వీకరించబడగలవు.

| వివరాలు | మూడు భాషల పత్రికలకు | | | ఒక భాష పత్రికకు | | |
|---|---|---|---|---|---|---|
| | పూర్తి పేజీ | సగం పేజీ | పావు పేజీ | పూర్తి పేజీ | సగం పేజీ | పావు పేజీ |
| | రూ | రూ | రూ | రూ | రూ | రూ |
| లోపలి పేజీ | 200 | 125 | 75 | 100 | 55 | 30 |
| వెనుకవైపు కవరుపేజీ | 350 | — | — | 150 | — | — |
| 2, 3 కవరు పేజీలు | 250 | — | — | 125 | — | — |

ఒక సంవత్సరం కొరకు స్థలమును కంట్రాక్టు తీసుకొన్నవారికి 20 శాతి రిబేటు ఇవ్వబడుతుంది.

## షరతులు

1. సాంకేతిక వివరాలు: 10¾ × 8¼" డెమ్మి.
2. ముందరి టైటిల్ పేజీపై ప్రకటనలు వేయబడవు.
3. పావు పేజీకంటే తక్కువ ప్రకటనలు స్వీకరించబడవు.
4. ప్రకటించవలసిన విషయము, అది వేయబడవలసిన స్థలము మొదలగు వివరాలూ, దానికయ్యే మొత్తమూ ప్రతినెల 3వ తేదీలోపుగా ఈ కార్యాలయానికి చేరినట్లయితే, ఆ ప్రకటన మరుసటినెల పత్రికలో ప్రచురింపబడుతుంది. ప్రకటనకయ్యే మొత్తమును మనియార్డరు ద్వారాగాని, లేక క్రాస్ చేయబడని డిమాండు డ్రాఫ్ట్ ద్వారాగాని పంపవలెను. డిమాండుడ్రాఫ్టు ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వ సమాచార పౌర సంబంధముల శాఖ డైరెక్టర్, హైద్రాబాదు—దక్కన్ పేరిట వ్రాయబడవలెను.
5. ప్రకటన నిమిత్తమై పంపబడు బ్లాకుల విషయంలో తగు జాగ్రత్త వహింపబడుతుంది. అయితే మిషను మీద బ్లాకులు గనుక పగిలిపోయినట్లయితే అందుకు ఈ శాఖ బాధ్యతవహించదు.
6. ప్రకటన ఎంత స్థలంలో ఏవైనం ప్రకారం వేయవలసింది, ఒక భాష పత్రికలో వేయవలెనా, లేక మూడు భాషల పత్రికలలో వేయవలెనా అనే వివరాలను స్పష్టంగా తెలియపరచాలి. ఉత్తర ప్రత్యుత్తరాలను, పైకమును ఈ దిగువ చిరునామాకు పంపవలెను.

డైరెక్టర్,
సమాచార, పౌరసంబంధముల శాఖ
ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం
హైద్రాబాదు దక్కన్ — 1.

# ఆంధ్రప్రదేశ్ రాష్ట్రం

| | | |
|---|---|---|
| వైశాల్యం | ... | 1,06,041 చదరపు మైళ్లు |
| జనసంఖ్య | ... | 3,12,60,133 |
| పురుషులు | ... | 1,57,42,912 |
| స్త్రీలు | ... | 1,55,17,221 |

సగటు వర్షపాతం

| | | |
|---|---|---|
| ఆంధ్ర ప్రాంతం | ... | 34.6 అంగుళాలు |
| తెలంగాణా | ... | 36.7 ,, |
| అరణ్య ప్రదేశం | ... | 1,40,26,000 ఎకరాలు |
| జిల్లాలు | ... | 20 |
| తాలూకాలు | ... | 183 |
| రెవిన్యూ సర్కిళ్లు | ... | 1,000 |
| పట్టణాలు | ... | 293 |
| గ్రామాలు | ... | 26,450 |
| పంటల క్రింది ప్రదేశం | ... | 2,93,81,000 ఎకరాలు |
| 1955-56 లో నీటిపారుదలను పొందిన ప్రదేశం | .... | 66.8 లక్షల యెకరాలు |
| కోళ్ల సంఖ్య | ... | 42,42,655 |
| 1955-56 లో వుత్పత్తి అయిన ఆహారధాన్యాలు | ... | 54.21 లక్షల టన్నులు |
| పాల వుత్పత్తి | ... | 15:5 లక్షల గేలన్లు |
| రైలుమార్గాలు | ... | 2,902 మైళ్లు |
| జాతీయ రహదార్లు | ... | 1,409 ,, |
| రాష్ట్ర రహదార్లు | ... | 2,072 ,, |
| జిల్లా పెద్దరోడ్లు | ... | 2,527 ,, |
| జిల్లా ఇతరరోడ్లు | ... | 3,458 ,, |
| పాఠశాలలు | ... | 28,000 |
| కళాశాలలు | ... | 47 |
| వృత్తి విద్యా కళాశాలలు | ... | 31 |
| ద్వితీయ పంచవర్ష ప్రణాళిక పరిమాణం | ... | రూ 175.37 కోట్లు |

1958-59 బడ్జెట్టు :

| | | | |
|---|---|---|---|
| ఆదాయం | ... | రూ | 63.66 కోట్లు |
| వ్యయం | ... | ,, | 62.67 ,, |
| పెట్టుబడి ఖర్చు | ... | ,, | 21.29 ,, |

